# మైదానం

(నవల)



చలం

అరుణా పబ్లిషింగ్ హౌస్
ఏలూరురోడ్డు, విజయవాడ - 2.

2

**మైదానం** (నవల)
అరుణా పబ్లిషింగ్ హౌస్ తరపున-
1వ ముద్రణ : 1981 జూన్
11వ " : 1999 మార్చి
12వ " : 2002 ఆగష్టు

రచనా కాలం : 1927



**ధర : 20-00**

డి.టి.పి :
**కల్పనా గ్రాఫిక్స్**
దుర్గాఅగ్రహారం, విజయవాడ-2. ఫోన్ : 434138

ముద్రణ :
**స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
గాంధీనగర్, విజయవాడ-3. ఫోన్ : 578211

3

# మైదానం

**'లేచిపోయినా' నంటే** ఎవరన్నా నన్ను, నా కెంతో కష్టంతో వుంటుంది. ఇదివరకంతా యీ మనుషుల్లోంచి, నీతి వర్తనుల లోంచి వెళ్ళిపోయి, ఎడారిలో జీవించడంవల్ల నేను చేసినపని ఘోరత్వం, నీచత్వం బోధపడలేదు. ఆ జీవితమంతా సుందరమైన స్వప్నంవలె, ఆ యెడారి పుణ్యభూమివలె, నా జీవితంలో ఈశ్వరుడికి నేనెత్తే మంగళ హారతివలె తోచింది. ఇంటినే, బంధువుల్నే, భర్తనే మరిపించగల అనుభవం ఎంత ఉన్నతమో అద్భుతమో నువ్వే ఆలోచించు. అమీర్‌నీ, మీరానీ అనుభవించిన తరువాత, మన చుట్టూ బతికే ఈ ప్రజలందరూ పురుషులేనా మనుష్యులేనా అనిపిస్తుంది నాకు. నేను బండి దిగేటప్పుడు వీళ్ళు చుట్టూ పొగై,

"లేచిపోయిందట్రా!"

"చాలా బావుందిరా మనిషి!"

"కావాలసిందే శాస్తి ముండకి!"

అంటూ వుంటే అర్థమయింది నాకు లోకమార్గం. చివరికి నువ్వు అన్నావు- 'లేచిపోవడానికి నీ భర్త లోపమేమన్నా వుందా?" అని. ఆయనెవ్వరు గుదువా? ఆమీరే నాకు కనపడకపోతే ఇంకా నా పెనిమిటితో కాపరం సుఖంగా, మత్తుగా చేస్తోవుండేదాన్నే. అమీర్‌తో నీకో ఇంకో పతివ్రతతో స్నేహమే వుంటే, మీరూ లేచిపోయే ఉందురు. అతని ఆకర్షణని నిగ్రహించలేక మీరూ, నేనూ కాదు జవాబుదారీ దానికి. ఒప్పుకోవూ? మీరెవరూ లేచిపోయి వుండరూ?

నీ మాటే నిజమేమో? ఆ ఆకర్షణ అర్థమయ్యే హృదయం వుండాలికదా! కాని మధ్యాహ్నపు సోమరి గాలి నన్ను తాకితే ఒళ్ళు ఝల్లుమనే నాకు, అమీరు విశాల వక్షపు వొత్తిడి స్వర్గంగా అర్థం కాకుండా వుండగలదా? పోనిండి. మీరే అదృష్టవంతులేమో తగాదా యెందుకు ?

ఒకనాటి పొద్దున్న, ఆయనతో ఏదో వాజ్యం విషయమై మాట్లాడ్డానికి వొచ్చాడు అమీర్. ఆఫీసుగదిలో ఏమీ మాటలు వినబడకపోతే, ఎవరూ లేరనుకొని కాఫీ లోపలికి తీసుకెళ్ళాను. ఆయన ముఖంచూడగానే గదిలో ఇంకా ఎవరో ఉన్నారని గ్రహించి వెనక్కి వెళ్ళటానికి చప్పున తిరగబోతూ వుండగానే, ఈ లోపునే ఎవరో గాఢంగా నా వీపుని చూపులతో స్పృశిస్తున్నట్లు తోచింది. అతనివంక పూర్తిగా కళ్ళున్నా ఎత్తకుండా లోపలికి వెళ్ళిపోయినాను. కాని ఆ చూపు నా వీపున వేసిన గాయం మాత్రం నన్ను రోజల్లా బాధ పెట్టింది. మర్నాడు సాయంత్రం మామూలుగా నేను వీధి గుమ్మంలో నుంచుని వుండగా మళ్ళా ఆ చూపే నా చంపకి తగిలి, తిరిగి అతన్ని చూశాను. వెంటనే సిగ్గుపడి లోపలకి వెళ్ళి, ఆ చూపులో ఎంత బలం, వాంఛ నిండి ఉందా అని ఆలోచించాను, ఆశ్చర్యంతో ఆ సాయంత్రమంతా. ప్రతిరోజు ప్రొద్దున్నా ఆ వ్యవహారంమీదనే అతను ఆయన దగ్గిరికి వచ్చేవాడు. నువ్వేమన్నా అనుకో, నేను కూరలు కొంటున్నా, మజ్జిగ చేస్తున్నా, కాఫీ తాగుతున్నాసరే అతను వొచ్చాడని తెలిసేది యెట్లాగో-ఇంకా బిగ్గరగా మాట్లాడే అతని కంఠం నాకు వినబడక ముందే నాకు గుర్తు తెలీకముందే, ప్రతిరోజూ నాలుగైదుసార్లు రోడ్డుమీద కనబడ్డాడు. రెండు మూడురోజులు గుమ్మంలో తను వొచ్చినప్పుడు లేకపోతే, నా కోసం తన చూపుని అక్కడ వొదిలి వెళ్ళాడా అనిపించేది నాకు. నేను తన వంక చాలా యిష్టంగా చూసే దాన్నని అమీర్ తరవాత అన్నాడు. నా మనసులో మాత్రం అతన్ని యెదుర్కొని చూడడం అతనితీవ్ర కాంక్షకి నేనుకావలసిందాన్ననే భావంతో గొప్ప సంతోషంతో నిండిపోవడం అలవాటైనాయి.

ఆ వేళ మధ్యాహ్నం రెండింటికి వాకిట్లో నుంచుని ఉన్నాను. ఎండతో ఆకాశం నుండి నేలవరకు లోకం నిండి వుంది. ఆ దాహం కొన్న యెండే వెన్నెలైనట్లు ఆ రోడ్లలో ఉద్యానవన విహారానికై వొచ్చినవాడివలె నడుస్తున్నాడు.

ఎక్కడకెక్కడ నా వస్త్రాల్లోంచి నాశరీరం కనబడుతుందో అన్నట్లు వెతికి, వొళ్ళంతా సిగ్గుపరిచాయి అతనిచూపులు. నిర్మానుష్యమైన ఆ రోడ్డుమీద నా కెదురుగా ఒక్క నిమిషం ఆగి ఇంట్లోకి పనిమీద వెళ్ళే యజమానివలె నడిచి వొచ్చాడు గుమ్మంవేపు. నేను ఇంట్లోకి వెళ్ళి ఆఫీసు గది గుమ్మంలో నుంచుని 'లే'రన్నాను. కాని అతను నేనేమంటున్నానో వినదలచుకోలేనట్టు తోచింది. నాతో గానీ, నా మాటలతో కానీ తనకి పనిలేనట్టే ఆ ఇంటికీ, తన హృదయానికీ తను అధిపతినని తెలిసినట్లే వొచ్చేశాడు. నేను లోపలికి వెళ్ళి తలుపు పక్కకి తప్పుకుంటో ఉండగానే వొచ్చి నా చుట్టూ చేతులు పోనిచ్చి అదుముకున్నాడు. అటు చూడలేదు, ఇటు చూడలేదు. అతని దృష్టి అంతా నా మీదనే. నా కోసమే. ఏం మోహమని! ఒక్క రెండు నిమిషాల్లో నేను బతికి ఉన్నానో, లేదో అది ఆఫీసు గదో, మహారణ్యమో-నేను నేనో, ఇంకెవరో తెలీనంత గాఢంగా, ఊపిరాడకండా, బలం మిగలకండా రక్తాన్ని ఆపేసి, గుండెల్ని పిండేసి మాయమైనాడు. వెళ్ళి శరీరమంతా సర్దుకొని మంచం మీద కూచున్నాను.

ఏం జరిగింది? ఇది పాత గదేనా! ఎప్పటి మధ్యాహ్నపు యెండేనా ఇది? లేచి ఏదో గొప్ప కార్యం, అందర్నీ ఆశ్చర్యమగ్నుల్ని చేసే పని చెయ్యాలనిపించింది. సంతోషంతో కేకవేశాను. చప్పునలేచి నుంచున్నాను నవ్వాను. అద్దం దగ్గరికి ఒక్క గంతేసి చూసుకున్నాను. నా మొహాన్ని నేనే ముద్దు పెట్టుకున్నాను. ఎవరితో చెప్పను ఈ సంతోషాన్ని? ఈ పునర్జన్మ ఉత్సవాన్ని ఏ విధంగా ప్రచురించను? ఎన్నడూ పాటరాని నా గొంతులోనించి సంగీతం బయలుదేరింది మొదటిసారి. నా బతుక్కి అంతా మొదటిసారి. మోహమాధుర్యంజల బైలు వెడలింది. ఇల్లంతా ప్రతిమూలా వెలిగింది, నా హృదయంలోని ఆనందజ్యోతితో. ఇంకోరు నన్ను, నన్నే నా ఆనందాన్నే కోరి, బాధపడి సాహసించి, ఆనందపడుతున్నారన్న అనుభవం పొందిన జన్మ మృత్యువును చూసి కూడా భయపడదు. అమీర్. నా అమీర్. నన్నేం చేశాడు? మనిషిని, నాకు దేవత్వాన్ని అమృతత్వాన్ని ప్రసాదించాడు.

'అసతో మా సద్గమయ,

తమసో మా జ్యోతిర్గమయ

మృత్యోర్మా అమృతంగమయ'

అన్న నా భర్త పఠించే ఉపనిసన్మంత్రం జ్ఞాపకం వొచ్చింది. నేనే మారిపోయినాను. నేను నేను కాదు. ఆ రోజే పాత రాజేశ్వరి చచ్చింది. అతనే నేనంతా-నేనంతా-అతనే. అతని బలమైన మోహంలో లీనమై పోయినాను.

ఆనాటి నుంచి ఇంక మధ్యాహ్నా మౌతోందంటే నా మనసు గంతులు వేసేది. 'ఎక్సైక్టేషన్‌తో నాకు ఊపిరి పీలవడం కష్టమయ్యేది. అన్నం వార్చేప్పుడు అమీర్ జ్ఞాపకం తట్టిందంటే నాకు తటస్థించిన మహా అదృష్టానికి చేతులు వొణికి తప్పేలాని నిలబెట్టడమే కష్టమయ్యేది. అన్నం తింటో వుండగా అమీర్ జ్ఞాపకం వొచ్చాడంటే ఇంక అన్నంకొంచెమన్నా సయించదు. నా పెనిమిటితో పడుకున్నప్పుడు అమీర్‌మీద మోహం కలిగి, నిద్రలో ఆయన్ని గట్టిగా కావలించుకున్నాను. నన్ను లేపి ఆయన 'చెడ్డకల వొచ్చిందా' అని అడిగారు. భయానికీ, మోహానికీ భేదం తెలీని ఆయనతో వొక మంచంమీద పడుకోవటం కన్న మన్మధుడికి అపకారం వేరే వుందా, ఏదన్నా 'లా పాయింటు' అడుగు; దేనికది చీల్చి వివరంగా అరగంట సేపు చెపుతాడు. ఎదుటిసాక్షి హృదయపరీక్ష చేసి చీల్చి తికమకలు పెడతాడు. భార్య కావిలించుకోవడం మోహం వల్లనో, భయంవల్లనో భేదం తెలీదు. ఇలాంటివారు మన భర్తలు! వాళ్ళకి పెళ్ళాలు కావాలా! లాయరు హంగులో మనమూ వొక భేషజం-ఆ పుసత్తకాల బీరువాలూ, గుర్రపు బండీ లాగే, ఎవరన్నా వొస్తే వొంటినిండా నగలు వేసి మనని చూపించవచ్చు. దేహంలో అక్రమంగా కలిగే ఆ కామరోగాన్ని మన ద్వారా కళ్ళు మూసుకుని నయం చేసుకోవచ్చు.

అమీర్ తలపు మాత్రంచేతనే నాకు కలిగే బాధని యెట్లా భరించ డమని భయం పుట్టేది. ఇది పశుకామమంటారు కాబోలు! అమీర్ కనబడక ముందు నా భర్తతో మామూలు ప్రకారం సంతోషమూ, బాధా ఏమీలేకుండా గడిపిన రాత్రులన్నీ ప్రేమ! ఆయనకి వండడం, మడిబట్ట లందీయడం, తలంటిపోస్తో వీపు రుద్దడం - యివి అధ్యాత్మికమైన నిర్మల ప్రేమ చిహ్నాలు. పార్వతమ్మ కట్టుకున్న చీరెని పొగిడి, అట్లాంటిది కొనిపెట్టమని నేను ప్రాణాలు తియ్యటమూ, పులుసులో యింగువ వాసన లేదని నన్ను ఆయన తిట్టడం యివి మానసిక ప్రేమతత్వాలు.

అట్లానే అమీర్‌తో అయిదారు మధ్యాహ్నాలు జరిగాయి. తలచుకుంటే నాలుగుగంటల కాలంలాగు తోచినా, ఒక పావుగంట కంటే ఎక్కువ అతను వుండలేదు. ఆ కాసేపట్లోనే నన్ను ఒక సంవత్సరానికి తగినంత మాధుర్యంలో ముంచేసేవాడు. అన్నిట్లోకి నాకు గొప్పగా తోచిందేమంటే-రోడ్డుమీద ఎవరున్నారో, యింట్లో ఎవరున్నారో చూడకుండానే సరాసరి వొచ్చేసి, సరాసరి లోపలికి, తిరిగి చూడకుండా వెళ్ళేవాడు అమీర్.

ఒకరోజు మధ్యాహ్నం 'నాతో వచ్చేయి' అన్నాడు. అదే మొదటిసారి, నాతో గొంతుకలోంచి మాట్లాడ్డం అతను. అప్పుడతని తురకల తెలుగు వింటే నాకెంత ముద్దొచ్చిందని! చిన్నపిల్ల మాట్లాడ్డానికి చేసిన ప్రయత్నంలాగే వుంది. అదివరుకు తురక తెలుగు పరమ అసహ్యంగా వినపడేది. కాని ఆనాటినుంచి గొప్ప సంగీతమై నా ముసల్మాన్ తెలుగంత మధురం యింకేదీలేదు, అన్పించింది. ప్రేమ-కాదు-పశుకామం-యెన్ని మార్పులు కలుగజేస్తుందో మనసులో!

అతనడిగిన ప్రశ్న నన్ను విభ్రమంలో ముంచగా తేరిపార చూస్తున్నాను. పళ్ళు బిగపట్టి తనకి కూడా వూపిరాడని అవస్థ కలిగించుకుని 'రావూ? రావూ? రాకపోతే చంపేస్తా నిన్ను' అన్నాడు. అతని కళ్ళల్లో మొదటిసారి చూశాను, భయంకరమైన ఎరుపురంగు. నన్ను తినెయ్యాలి. నన్ను చంపెయ్యాలనే ఉగ్రం-మళ్ళీ వారం క్రిందట చూశాను.

“చెపుతాను తరవాత. మళ్ళీ నువ్వు రావూ, అప్పుడు సావకాశంగా మాట్లాడాలి” అన్నాను.

మళ్ళీ వారంరోజులుదాకా వీలుకాదు ఆయన వూరికి వెళ్ళిన రాత్రి అమీర్ని రమ్మన్నాను. పదిగంటలైంది. పడక గదిలో అద్దం ముందు నుంచుని నన్ను నేను చూసుకున్నాను. చీకట్లో సిల్కు జాకెట్టు చూస్తాడా? ఈ ముత్యాలహారం కనబడుతుందా? అతని కేమన్నా ఫలహారం పెడితే ఏమను కుంటాడు? కాని వ్యవధాన మిస్తాడా? వొంటికి అత్తరు రాసుకో బోయినాను. ఆయన పన్నెండు రూపాయలు పెట్టి కొని తెచ్చిందది- ఆయన తెచ్చిన అత్తరు అమీరుకోసం పూసుకోవడమంటే చప్పున సిగ్గేసింది-బుద్ధి అక్కడపెట్టి ఆలోచించాను. కాని జాకెట్‌మాత్రం ఆయన్ది కాదూ, విప్పేశాను. తక్కిన

బట్టలో? నవ్వొచ్చింది నాకు. మళ్ళీ జాకెట్ వేసుకుంటున్నాను.

మళ్ళీ యింతలో ఆలస్యమౌతోందని జ్ఞాపకం వొచ్చి, అన్నీ అట్లానే వదిలి, ఆఫీసు గదిలోకి వచ్చి బైట గుమ్మం తెరిచి, పక్కగా రోడ్డుమీదికి కనపడుతో నుంచున్నాను. బైట యింకెవరికన్న కనబడుతున్నానేమోనని భయం వేసింది. లోపలిగా జరిగాను. కాళ్ళు వొణికి నుంచోడం కష్టమై యిటూ అటూ నడిచాను. రోడ్డుమీద దీపం నామీదపడుతోంది. అక్కడక్కడ కాళ్ళు చప్పుడైనప్పుడల్లా గుండెలు కొట్టుకొని నీరస పెట్టేశాయి. గదిలోకి వెళ్ళి కూచున్నాను. అమీర్ వొచ్చి, నేనులేనని వెళ్ళిపోతాడేమోనని భయమేసి లేచాను. కాని 'గదిలోనే వుంటాను రమ్మని చెప్పా'నని జ్ఞాపకం వొచ్చి కూచున్నాను. కాని చెప్పానా? చెపుదామనుకున్నాను కాని చెప్పానా? అవును. చెప్పాను. చెప్పినప్పుడు అమీర్ కనుబొమ్మలు పైకి లాగాడు. యెందుకా అనుకున్నాను కూడాను. కాని బైటికి వెళ్ళడం యెలా అయినా మంచిది. అని బైటికివెళ్ళి పదినిముషాలు నుంచున్నాను. ఈ రాత్రి రాడేమో? నాతో ఒట్టి తమాషా చేశాడేమో యిన్ని రోజులు? ఆ రాత్రి యేదన్నా పని వుండిపోయిందేమో? కాని ఆ పని మానుకుని రాడా? రాత్రులు దారి తెలీదేమో? నువ్వువరని పోలీసులు పట్టుకున్నారేమో? గుండె దడదడలాడింది. మళ్ళీ గదిలోకి వెళ్ళి కూచున్నాను. ఇంత బాధ పెడుతున్నందుకు అమీర్ మీద కోపమొచ్చింది. తొరగా వొస్తేనేం?

నా మనసు ఆందోళనఅణచడానికి కిటికీలోంచి కనపడే నక్షత్రాలన్నీ లెక్కపెట్టాలనుకున్నాను. ఇవన్నీ ఎందుకుచెబుతున్నానంటే నీకు-కొంచెం అలస్యమైతే యింత బాధపడ్డానే, యిదంతా కామమేనా? ఇదే ఆలోచిస్తున్నాను నిన్న మామయ్య ఇక్కడికి వచ్చి అన్నాడు. "చెప్పితే విన్నావు కావు. చూశావా? నీ గుడ్డి కామం నిన్నెంతకి తెచ్చిందో?" మామయ్య ఈ మాటలంది! నేను కాపరానికి వెళ్ళకముందు ఆరునెలలు నా వెంట వెంటపడి లోబరుచుకోవాలని చూశాడు, ఒక్కరికీ తెలీకుండా. ఎవరితోనన్నా చెప్పుకోడం నాకు సిగ్గని తెలుసు. చివరికి నేను అమ్మతో చెప్పితే అంతా అబద్ధమని బూకరించాడు. ఆ మామయ్య యీ మాటలంది! నిజమని వొప్పుకునే ధైర్యమే కలవాడైతే, నా స్వభావం మామయ్యని స్వీకరించి వుండునేమో; అమీర్‌నే అడగమను

ఎవర్నన్నా, అబద్ధం చెపుతాడేమో! అది పోనీలే. కాని నాది కామమేనా? నా కామమా; నా త్యాగమా, నన్నీ ఖైదులోకి తెచ్చింది? ప్రేమ శిరోభూషణం, పురాణ స్త్రీలందరూ గుడ్డిగా అనుసరించిన పతివ్రతా ధర్మం ఆ త్యాగమేనా? ఇంత గాఢంగా అతన్నే కోరాను. అతన్ని పూజించాను. అమీర్ని, అతని కోసం నా బంధువుల్ని, కాలాన్ని, సంసారాన్ని, సుఖాన్ని వొదిలాను. అది యింకా కామమేనా? నా అమీర్‌కోసం నేను చేసిన త్యాగాల్లో నూరోవంతు చేస్తారా ఈభార్యలు? నువ్వు యోచించు. నా హృదయ మతనికోసం యెట్లా ఎంత తపించిందో? కామం వల్లనే?

నిష్కారణంగా పక్కున నవ్వాను. నా మెళ్ళో ముత్యాలు నాలుగు వందల యాభైమూడు ఉన్నాయేమోనని లెక్క పెడుతో వుండగా వచ్చాడు అమీర్-చెప్పులు పెద్దగా చప్పుడు చేసుకుంటో. కొంచెం నెమ్మదిగా వస్తే అతనిసొమ్మేం పోయింది అనుకుంటూ ఒయ్యారంగా తలుపు దగ్గిరికి వెళ్లాను. వెంటనే కావలించుకొని గట్టిగాపట్టుకొని ఒక్కసారిగా నాతోగూడ వెనక్కి నడవడానికి ప్రయత్నించి వొదలక తూగి, తూలి పుస్తకాల బీరువా మీద పడ్డాము. పెళపెళమని అద్దం పగిలి గల్లుమని పెంకులు కిందపడి మళ్ళీ బద్ధలైనాయి. ఏం జ్ఞాపకమొచ్చిందో ఆ నిమిషాన ఆయన బీరువాని మేమిద్దరం పగలకొట్టడం అతి హాస్యాస్పదంగా కనబడి, పక పక నవ్వి బద్ధలయ్యేఅద్దం పెంకుల చప్పుడుతో నా కంఠం కలిపాను. తరవాత నిమిషం నా వూపిరాగింది. ఇల్లంతా, నడవాలో పడుకున్న వాళ్ళంతా, విని లేచినట్లే తోచింది. అమీర్ కౌగిలిలో పెనిగాను. కాని ఒదలడుకద! మనుష్యులు లేవడం, వెతకడం, దీపాలతో గదినిండడం జరిగినట్టే తోచింది నాకు కాని వాళ్ళందరూ వచ్చినా, అమీర్ మాత్రం తలన్నా ఎత్తి చూడకుండా తన పని తాను చేసుకునేటట్టు కనపడ్డాడు. అపాయమంటే ఏమిటో అర్థంకాని మనిషి అతనొకడు కనపడ్డాడు నాకు. అదేమి అదృష్టమో ఆ అపాయం అతన్ని చూసి తొలగిపోయేది. అతని నిర్లక్ష్యం చూస్తే ఒకప్పుడు అతని పాదాల్ని నా ప్రాణాలతో కడగాలనిపిస్తుంది. ఒకప్పుడు మీదపడి చీల్చి చంపెయ్యాలనిపించేది.

కొంత సేపయిం తర్వాత స్వస్థపడి నెమ్మదిగా మాట్లాడుకున్నాము కిటికీ దగ్గిరిగా బల్లమీద కూచుని, మామిడిచెట్టు పూతలోంచి మిణుగురు

పురుగులూ అర్ద్రా కలిసి మెరుస్తున్నాయి. చలిగాలి మమ్మల్నప్పుడప్పుడు పలకరిస్తోంది కాలవలో కప్ప మూలుగుతోంది. రోడ్మమీద లాంతరు వెలుతురు కొంచెంగా బీరువా మీదపడి, ఆ లావాటి పుస్తకాల మీది బంగారపు అక్షరాలు తమాషాగా మెరుస్తున్నాయి.

'ఎక్కడికి తీసికెడతావు నన్ను.'

'నిజాం?'

'వెళ్ళి?'

'హాయిగా వుందాం?'

'అందరూ వూరుకుంటారా?'

'తెలిస్తేకద! వెళ్ళిపోయాక తెలిస్తే మాత్రం యేం చేస్తారు?'

'అక్కడి వాళ్ళూ!'

'మనకి తెలిసినవాళ్ళేవరుంటారు? ఆ దేశం చాలా బావుంటుంది. మనుషులు చాలా మంచివాళ్ళు, స్నేహానికి ప్రాణమిస్తారు. నీకేం భయం లేదు' అన్నాడు.

అదివరకే నిశ్చయించుకున్నాను వెళ్ళాలని. యెందుకు? అమీర్తో వుండాలని. అతనితో కావలసిన కామం యిక్కడ అభ్యంతరం లేకుండా సాగుతూనే వుంది. (నాకే కాదు. చాలామంది పతివ్రతలకే సాగుతోంది.) అట్లాంటప్పుడు ఇంట్లోంచి పోయి కులభ్రష్టని కావలసిన అగత్యమేముంది? అమీర్తో కామం తీర్చుకోడానికి కాదు. అతని ముఖం చూస్తో అతన్ని పూజించడానికి! వంటకోసమూ, ఆ రాత్రి నిమిషాల కోసమూ, నా భర్తతో బతికాను. అమీర్తో అందుకుకాదు. అమీర్ కళ్ళలోని ఆరాధన చూసేందుకు, అతనితో మాట్లాడి, అతనివంక చూస్తోవుండే అదృష్టానికి వెళ్ళాను. అది కామమే? ఈయనతో జీవనం పవిత్ర ప్రేమా? అమీర్ ఒక్కసారి కూడా నన్ను తాకనన్నాసరే వెళ్ళిపోయేదాన్నే, అతని పాదసేవకి, అతనితో సుఖదుఃఖాలు పంచుకునేందుకు. అతని ఆజ్ఞలే అతని దయే, అతనిపూజే నా మతంగా, నా ధర్మంగా, నా ఆనందంగా, నా జీవనాన్ని అర్పించేందుకు, అతను నన్ను ప్రేమించనీ, చంపనీ, పాలించనీ, వొదిలెయ్యని. ఆ కొత్తవాడు, తురకవాడు,

అతని చేతుల్లో నా ప్రాణాల్ని అర్పించాను. ఇంత విశ్వాసమూ ఇంత త్యాగమూ అంతా కామమేనా? నా హృదయంలోని ఆ అప్రమేయానందమూ, ఆ అనిర్వచనీయ మాధుర్యమూ, నా అల్పత్వమూ, క్షుద్రత్వమూ, వొదిలి, నగలూ, చీరలూ, మర్యాద అన్ని అసహ్యాలనిపింపజేసిన అద్భుతానుభవం కామమా? ఎన్నడూ అంతవరకు అసలు జీవితంలో సాధ్యమని అనుకోని, అమహాద్భుతరసనా, రసికత్వమూ ఔన్నత్యమూ ఇవన్నీ క్షుద్రకామమేనా? భోజనమూ, నిద్రా లోభత్వమూ తిట్లూ, చీవాట్లూ, అసహ్యమూ, ఇదంతా పవిత్ర ప్రేమా! అట్లా అయితే ఈశ్వరుడే, సృష్టి రహస్యమే కామం. ప్రేమ అంటే ద్వేషమని అర్థం.

# 2

**అక్కడికి** వెళ్ళిన మొదటి నిమిషానే అర్థమయింది నాకు, ఆ స్థలంలో అద్వితీయానందాన్ని అనుభవించబోతున్నానని, చుట్టూవున్న ఆకాశాన్నీ, కొండల్నీ, పక్కన చింత చెట్లనీ, మా చిన్న యిల్లునీ, ఆ గాలినీ,అమీర్నీ చూడగానే నా మనసెట్లా అయిందనుకున్నావు! చెప్పనా? చిన్నప్పుడు మన ముందు పది పిండి వంటలు పెడితే, యేది తినాలో తోచక, తినబోతున్నామని తెలిసికూడా అన్నీ ఒక్కమాటుగా యెట్లా తినాలా, ఇది తినేలోపల రెండోది రుచి చూడడం అలస్యమౌతుందే, అని ఎంత కష్టపడుతుంది మనసు? అట్లానే ముందే, తెలుసు, దినం తర్వాత దినం నాకు తీసుకురాగల వివిధవర్ణ రాగసుందరానుభవాలు! కాని ఆగలేను. అన్నీ ఒక్కసారిగా, తొరగా యెప్పుడు నన్ను కావలించుకుంటాయా అని తహ తహలాడిపోయినాను. ఏం కారణం లేకుండా చిన్నప్పుడు నవ్వూ, అర్థంలేని ఆనందం కలిగి ఇంకా ఏంచేద్దాం, తిరుగుదాం, గంతులేద్దాం, నవ్వుదాం అనిపించేదే! అట్లా వుండేది గంట గంటా నాకు. వూరికీ, మాకూ మధ్య పెద్దచింతతోట వుంది; ఆ గుడిశ తప్ప యింక చుట్టూ ఏమీ లేవు. ఎటుచూసినా నీలపు కొండ్లోనూ, ఆకాశంలోనూ అంతమయ్యే పెద్ద మైదానం. ఒక్క పెద్ద కొండ మాత్రం మా యింటికి అరమైలు దూరంలో వుంది. దానిమీద శిథిలమైన కోట ఒకటుంది. మా గుడిశ పక్కన చిన్న యేరు ఎప్పుడూ తొరగా

పరిగెత్తుతో వుంటుంది. దాన్నిచూస్తే, ఎవ్వరితో మాట్లాడక ఇంట్లో పనీమీద యెప్పుడూ తిరిగే మా అమ్మ జ్ఞాపకం వొచ్చేది.

ఆ దేశంలో ఆకాశం ఎప్పుడూ నీలం కారుతున్నట్టే వుంటుంది. వాన కురిసినా శుభ్రమైన కొండల్నీ, నేలనీ ఇంకా శుభ్రంగా కడుగుతుంది. టపటపమని చినుకులుపడితే, కడుపుతో ఉన్న స్త్రీవలె నా యేరు నిండి పోయేది. కొండలన్నీ మేఘాల్ని కప్పుకుని తెల్లనయేవి.

మొదట కుండల్లో వండడం నెయ్యీ కూరలూ లేకుండా తినడం, చాపేసుకుని ఆరుబైట పడుకోవడం కొత్తగా కష్టంగా వుండేది. అప్పుడప్పుడు పిచ్చి పట్టుదలలు కూడా పట్టేదాన్ని, కాని కష్టపడ్డానికీ, కొత్త పడడానికీ వ్యవధి వుంటేనా? అమీర్ వుండనిస్తేనా? అయినప్పటికి నాకు చిన్నప్పటి అలవాట్లు వదలడం ఎంతో కష్టమయింది-వంట చేసేప్పుడు అమీరావేపు వొస్తే అన్నీ పారేసి దూరంగా పోయినాను. అన్నం తినక తిరిగాను. కాని ప్రేమ వున్నప్పుడు త్యాగం చెయ్యడం ఎంత సులభమనుకున్నావు? ఊరికే ఏ త్యాగానికైనా పతివ్రతల్ని పొగుడుతారుగాని ప్రతి నిమిషం సౌఖ్యాల్నీ,ఆనందాన్నీ అవసరంగానైనా సరే వొదిలేసుకుని ప్రేమబలం స్థిరపరచాలని వుంటుంది.

ఆయన్ని ప్రేమిస్తో నేను ఆయన యింట్లో వున్నప్పుడు ఒకసారి యింగ్లండు వెళ్ళివచ్చిన ఆయన స్నేహితుణ్ణి తీసుకొచ్చి తనతో భోజనం వడ్డించమన్నారు. ససేమిరా వీల్లేదన్నాను. కారణం - మా పెత్తల్లి సూరమ్మగారికి నా మీద కోపం వస్తుంది. ఏమంటుంది? 'మొగవాడు అతడు అన్నీ నిర్లక్ష్యంగానే చెయ్యాలంటాడు. ఆడదానివి నీకు బుద్ధిలేక పోయిందా? అంటుంది. తోడికోడలు నన్ను వెలేస్తానని బెదిరిస్తుంది, నవ్వు లాటకులాగు. పాపం ఆయన నన్ను బతిమాలారు. తన పరువు పోతుందని కన్నీళ్ళపర్యంత మైనారు. తనమీద ప్రేమలేదా. తనమాట వినకూడదా అని అడిగారు. రాయివలె స్థిరంగా నా పట్టుదల విడవలేదు నేను. ఇదీ మనం భర్తలకోసం చేసే త్యాగం. ఆధ్యాత్మిక ప్రేమ. పవిత్ర దాంపత్యానికి మన జీవితంమీద వుండే "ఇన్ఫ్లుయన్సు" కాని మామయ్యవొచ్చి, "చివరికి తురకకూడు తింటున్నావుటే!" అంటే నాకేమనిపించింది? ఏమన్నాను? ఇది తురక కూడా? ప్రేమదేనికి నైవేద్యం పెట్టి భక్తితో కళ్ళుకద్దుకుని మధ్య మధ్య అమీర్

ముద్దులతో ఆరగించిన ఆ అమృతం తురక కూడా? ఏం తింటున్నామో, తింటున్నామో లేదో అనే ధ్యాస వుంటేనా? ఇంక బతకడానికి వీలులేదనీ ఆకలేసి మధ్య మధ్య ఆనందానికి అవాంతరంగా మనసు మళ్ళించుకుంటానే గాని, ఇంక యింటిదగ్గరవలె ఈ కూరలో వుప్పు సరిపోయిందా, ఈ చారులో పోపు చాలిందా అనే ఆలోచనలు వుంటాయా? పచ్చడిలో యిసక పడ్డదనీ, అన్నం చిమిడిందనీ, పులుసు ఉడకలేదనీ తిట్లూ - లేచిపోవడాలూ - విస్తరి మొహాన కొట్టడాలూ పవిత్రమైన మానసిక ప్రేమగల ఆదర్శ సంసారాల్లో జరుగుతాయిగాని, పశువులవలె కామంలో పొర్లాడే గుడిసెల్లో జరగనే జరగవు! మానసిక ప్రేమగనక- దాంట్లో వుప్పెక్కువైందనీ, కారమెక్కువయిందనీ, తగాదా! ఈ మానసిక ప్రేమమీద నా కెందుకంటే అంతకోపం - మామయ్య తీసుకొచ్చాడు దాన్ని వాళ్ళ వూరినించి, దాని సంగతి చెపుతా తరవాత. కామంలో పడి కళ్ళు మూసుకుని నరకంలోకి జారేవాళ్ళకి ఈ విచక్షణలన్నీ యెందుకుంటాయి! గంజే పరమాన్నంగా వుంటుంది. అది మళ్ళీ ప్రేమలక్షణమే నంటారు కొందరు పూర్వులు. కాని మామయ్యవంటి విమర్శకులు మాత్రం దాన్ని పశుకామమే నంటారు! ఎందుకు? వారి నీతి హృదయాలకి నెప్పి కలిగిస్తోంది! నావంటి వారి పాడుజీవిత చరిత్రలని చదివీ, వినీ వారి భార్యలూ, కూతుళ్ళూ లేచిపోతే యెట్లా ?

ఇంక విను. అరుబైట చక్కని బంగారపు టెండలో చేతులు పైకి చాచి, ఆవలించి, వొళ్ళు విరుచుకుని చాపమీద నించీ ఒక్క దూకు దూకి లేచి ఒకరి మొహం వొకరు కొత్తగా, అందంగా చూసుకుని రాత్రి జ్ఞాపకం వల్ల కొంచెం సిగ్గుపడి, చుట్టూ వున్న సౌందర్యాన్ని చూసి నవ్వడం. కారణం లేకుండా, ఆనందంతో ఒకరికి ఒకరమూ, మా ఇద్దరికీ కలిసి ఆ సుందరలోకం వుందని నవ్వడం. పొద్దున్న కాఫీలా? ఏంలా. ఒక్క రోజు కాఫీ గంట అలస్యమయితే గిలగిలలాడేదాన్ని. మొదటిరోజు నించి కాఫీనే మరచి పోయినాను. పెందరాళె , ఇన్ని బియ్యం కుండలోవేసి యేట్లో కడిగేటప్పటికి అమీర్ యిన్ని చితుకులతో పొయ్యి వెలిగించేవాడు. ఆ మంట అయిపోయేటప్పటికి అవి వుడికివుండేవి. గుడిసె వెనుక రాయి వుంది. దానిమీద యే వుల్లిపాయో, గోంగూరో, మిరపకాయా, ఉప్పువేసి నూరడం, అంతే వంట. వున్నప్పుడు చల్ల.

అమీర్ బైటకూచునీ పావురాలని అడిస్తోవుంటే అప్పుడప్పుడు తమాషాకి నేను వెళ్ళి గుడిసె తలుపుచాటు నుంచి సన్న గొంతుతో.

'లేచి మడికట్టుకోండి' అనేదాన్ని, అతను ప్రయత్నంలో నా భర్త గొంతూ, బ్రాహ్మణ వుచ్ఛారణా పెట్టి -

'ఇదిగో లేస్తున్నా, ఈ కాయితము చదివేసి....' అనేవాడు. ఒకసారి మరిచిపోయి 'ఈ పావురాన్ని ఒదిలి' అన్నాడు.

ఏం నవ్వేవాళ్ళం !

ఒకసారి అమీర్ వచ్చి 'మరి కచేరీవేళ అయింది. యింకా వంటకాలా?' అన్నాడు.

'అయ్యో, ఈవేళ తద్దినమని జ్ఞాపకం లేదూ, మీకు?' అన్నాను.

ఆ మాటకి నన్ను పట్టుకుని దవడవేపు భీకరంగా ఒంగితే తప్పించు కోడానికి పెనుగులాడాను. అందుకని భుజంమీద కొరికాడు. అదుగో వెక్కిరిస్తోంది నీ నొసలు: కొరకడమేమిటి, అదేం సరసమనేనా? ఆ మైదానంలో గుడిసెల్లో బతికి, కుండల్లో తినేవాళ్ళకి మాకు నాజూకు లెక్కడివి! దేహాన్ని మనసునీ కూడా అంటకుండా కళ్ళుమూసుకుని వేదాంతోక్తంగా సంసారాలు గడపడం; పుష్టీ, జవా నిండు రక్తమూ వున్న మోటు ప్రజలకి చాతకాదు మరి. చదువులతోనూ, రోగాలతోనూ ముప్ఫైయేళ్ళకే ముసలి వాళ్ళయిన యీ నవీన రసికులకి మాత్రమే చేతనౌను. మాటలతోనూ, ధర్మబోధనలతోనూ, ఆధ్యాత్మిక ప్రేమతోనూ తృప్తి పొందడం. అమీర్‌కి సంతోషం ఒచ్చి నన్ను ఒక్క వూపు వూపాడా,కళ్ళుతిరిగి దూరంగా తూలేదాన్ని. గట్టిగా జబ్బ పట్టుకున్నాడా రెండుగంటల దాకా నెప్పిపోదు. కావలించుకుంటే వూపిరాడదు. మొదట్లో- కళ్ళలో అల్లరీ, ప్రేమా, మరచి పోయినాను. (మామయ్య ఆ మాట అనబద్ధన్నాడు) కామమూ, వెలుగులో నా వంక పడినాడా భయంతో ఒణికేదాన్ని.

ఇంక మా స్నానం. రోజు కెన్నిగంటలు! యెన్నిసార్లు గడిపే వాళ్ళమో ఆ యేట్లో? వాన కురుస్తున్నా, చలేస్తున్నా, ఎండలో చీకటిలో, యెప్పుడూ స్నానమే. యెంత బావుండేది యెండలో తళతళలాడే యేటి చల్లటి నీళ్ళలో తెల్లని యిసకమీద పడుకోడం! ఆ చిన్న అలలు నా మెడని కొడుతూ, నీళ్ళు స్నేహితులులాగ యిద్దరినీ దగ్గిరికి లాగుతూ పరిగెత్తడం యెంత బాగుండేది?

ఒకసారి చీకటిలో అమీర్‌తో 'అమీర్! నా కార్యంనాడు ముత్తైదులు నన్నాయన దగ్గిరికి ఈ నీళ్ళలాగే తోశారు' అన్నాను. వీపు వెనక నించి అతని నవ్వు వినబడుతుందనుకున్నాను. దానిబదులు కర్కశమైన కంఠంతో "ఎవరు వాళ్లు" అన్నమాట వినబడ్డది.

ఆశ్చర్యపడి! తమాషా చేస్తున్నాడని వెనక్కి తిరిగి చీకటిలో అతని మొహాన్ని వెతికాను నీళ్ళమీదనుంచి.

'ఎవరేమిటి?'

'వాళ్ళపేరు?' అన్నాడు ఖండితంగా. 'ఆ ముత్తైదు ముండలంటే!' అన్నాడు విసుగుతో.

చప్పున నీళ్ళలో అతని దగ్గిరికి తేలి భుజాల్ని అనుకుని. చేతులు మెడచుట్టూ వేసి.

"ఎందుకు అమీర్! ఏమిటా కోపం?'

'చెప్పు.'

'వాళ్ళ పేర్లా?'

'అవును.'

నవ్వాను-ఊగే నా వక్షం నీళ్ళలో నించి అతని హృదయాన్ని కరిగించింది.

'నిన్ను - నిన్ను - నాదాన్ని - వాడి దగ్గిరికి. ఆ బొండు వాడి దగ్గిరికీ బలవంతంగా లాగారా ? ఆ రాత్రి, పాపం, చిన్నదాన్ని - సహాయం లేనిదాన్ని - నిన్ను వాడి చేతల్లోకీ-వాడి-గదిలోకి-నరుకుతా, ఒక్కొక్క ముండనే కొప్పుపట్టుకు లాగి-ఒక్కొక్క' ..... ఇంకేమేమో అన్నాడు. ఆ మాటలే దుర్గమ్మత్తా, ఆ తాసీల్దారుగారి భార్య వింటే? నాకు చాలా నవ్వొచ్చింది.

'కాని నాకు వెళ్ళాలనీ వుందిగా! ఊరికే సిగ్గుపడుతున్నాను-అంతే!'

నా నోరు గట్టిగా మూశాడు. 'అనకు, ఆ మాట అనకు, వాడి మీద ఆ పంది మీద, ఆ కుళ్లు సిబ్బిమీద నీకు నీకు....

పక్కున నవ్వాను. ఆయన్నంటే కోపమే రాలేదు. అదేదో పూర్వజన్మ భాగ్యంది ఆయనతో కాపరం.

"కుళ్లు సిబ్బేమిటి, అమీర్...." నవ్వుతున్నాను. ఆ నీటి మీద నించి నా నవ్వు బ్రిడ్జికింద ఆ చీకటిలో మారుపలికింది. అమీర్‌కి అంత యీర్ష్య. సహించలేడు. ఆయన్ని గురించి ఒక్క మంచి మాట మాట్లాడితే!

విను, యెంత సంతోషంగా వుండేది అట్లా స్నానాలుచేస్తే. స్వర్గంలో సౌఖ్యాలంటే ఇదేగావును అనిపించేది. స్వర్గనరకం సంగతెత్తితే అమీర్‌కి కోపం. మన స్వర్గం అదీ అంతా అబద్ధమంటాడు. తనతో కూడా నన్ను వాళ్ళ తురక స్వర్గానికి తీసుకుపోతా ననేవాడు.

'నేను ముందర చస్తే?'

'నేను చస్తా!'

రెండో మాట నేననలేక వూరుకుంటే, అతనే -

'నేను చస్తేవుంటే, నిన్నూ చంపుకుంటా' అన్నాడు.

'పోనీలే పాపం నీకోసం నేనూ చస్తాలే' అన్నాను నవ్వుతో.

'చావకపోతే చంపుతా'

'కాని అమీర్ మనం చేసిన ఈ ఘనకార్యానికి మనకి స్వర్గమిచ్చే దాత యెవడు ?'

'మా స్వర్గంలో ఫరవాలేదు. నేను మాట్లాడతాగా?'

'ఎవరితో?'

'మా స్వర్గం వాళ్ళతో'

'తమాషాగా వుందే, మీ స్వర్గం సంగతి! మీ నరకంలో ఎవరుంటారు?'

"హిందూ ప్లీడర్లు, కాఫర్లు" అని రాయిపెట్టి కుండ పగలగొట్టాడు! నవ్వెట్లా ఆపుకోను?

"ఆయన మూలకంగా ప్లీడర్లందరికి యిప్పించావా నరకం?"

"కాకపోతే నా దగ్గర వ్యాజ్యానికని ముగ్గురు ప్లీడర్లు గాడ్దె కొడుకులు మూడు అర్లు పద్దెనిమిది రూపాయలు లాగారు. వాళ్ళందరికీ బాధ.... నరకమే"

"నీ పెత్తనమే!"

"చూస్కో, అబద్దమేమో!"

"ఇంకేం మాట్లాడను?"

అట్లా గడిచేవి మా స్నానం సంభాషణలు. ఒకరినొకరు నీళ్ళ కింద తాకుతో, ఒకరిని ఒకరు రుద్దుతో, తోసుకుంటూ యెన్నో గంట లాడుకునే వాళ్ళం. అమీర్ నాకు యీత నేర్పాడు. ఎవరన్నా కొత్తవాళ్ళు వొంతెన మీద నించి వెడుతోవుంటే, ఇద్దరం కదలకుండా దానికింద యిమిడి, వాళ్లు వెళ్ళగానే పెద్ద నవ్వు నవ్వుతాము. నా జుట్టు నీళ్ళలో నల్లగా తేలుతో చేతులు నీళ్ళకింద వొంకరగా కనపడేట్టు నీళ్ళు తోసుకుంటూ యీత్తే అమీర్-అలా నిలిచి నన్ను చూస్తో,

"ఆగకు. అలానే తేలుతో వుండు. అలానే యెప్పుడూ.... ఆ జుట్టెక్కడిది? ఎలా తెచ్చుకున్నావు? అరేబియాలో రాత్రి వీచే యీదురు గాలి నీ జుట్టు రూపం దాల్చింది!" అని వూరికే బాధతో మురిసిపోతాడు. మునిగివొచ్చి నా కాళ్ళని పట్టుకుని నీళ్ళల్లోకి లాగి ముంచి కావిలించు కుంటాడు. ఇద్దరం అల్లానే మునిగిపోయినాము అడుక్కి, నల్లని యిసిక మీద పడుకుని పైకి నీలంలోకి చూశాను ఒక నిమిషం. అతని చేతుల్లో అతని కింద అక్కడే వుండాలనుకుంటున్నా. ఇంతలో నీళ్ళు తాగేశాను ఒక్కొక్క రాత్రి వెన్నెట్లో స్నానంచేస్తాము. అమీర్ ఆ వొడ్డుకి యీది, దూరమై నీళ్ళకింద దాక్కుని భయపెడతాడు. యెవరూ లేక యిద్దరమే ఆ నీళ్ళ నిశ్శబ్దంలో కూచుని ఒకరి మొహాలొకరకం చూసుకోవడం నాకు భయం. కాని అమీర్ దగ్గిరిగా వుండి చేయ్యేసినంతసేపూ యేదో నీళ్ళ లోకంలో వున్నట్లుండేది. ఒక రోజు నన్ను 'ఉలూపి' అని పిలవమన్నాను, నా అర్జునుణ్ణి. అర్జునుడూ, అదంతా అబద్ధమంటాడు అమీర్.

పూర్వం మా మరిదిన్నీ, అతని పెళ్ళామున్నూ బట్టలిప్పేసుకుని ఒకరికెదురుగా ఒకరు కూచుని స్నానాలు చేస్తారని విని నాకు పరమ అసహ్యం వేసేది. కాని యేటిలో రాత్రులు యిద్దరం బట్టలన్నీ యివతల పారేసి స్నానం చేసేవాళ్ళం! నీకర్థమౌతుందా ఆ ఆనందం! కామం పశు కామమంటున్నాయి నీ కళ్ళు! కామం కాదు, ఈ ఆకాశంకింద ఆ నీళ్లలో బట్టలెందుకు! బట్టలు వేసుకున్నా గాలీ, నీళ్లూ వొంటినంతా తాకుతాయి.... అమీర్ కూడా అంతే.

ఇద్దరం నీళ్లలో దొల్లుతూవుంటే అమీర్ వేళ్ళు నా జుట్టునీ, బుజాల్నీ, రొమ్ముల్నీ, తొడల్నీ తాకితే నాకు చెరువులో తామర కాడలు వొంటికి తగిలినట్టుండేది. అతడు మగవాడనే భావంగాని, అతని స్పర్శవల్ల కామ వికారం గలగడంగాని ఏమీ వుండేది కాదు. రాత్రులు అతను నన్ను కోరేప్పటి స్పర్శకీ, తక్కిన రోజుల్లా నాతో ఆడుకునేప్పటి స్పర్శకీ స్పష్టమైనభేదం వుంది. సమయాలను బట్టి అమర్ నాస్నేహితుడుగా, అన్నగా, తండ్రిగా, బిడ్డగా, గురువుగా, భర్తగా, ప్రియుడిగా, అధికారిగా మారేవాడు. నేనూ అంతే. ఒకప్పుడు అతి చనువు! ఇంకోసారి కారణం లేనిదే బింకం. కొత్త లేనిదే అమితమైన సిగ్గు. పిచ్చి దయ. కపటమైన కోపం. తల్లి చూపే లాలన. బోగందానిబెట్టు. సత్యభామ ధూర్తత్వమూ, కలహమూ అన్నీ రకరకాల మారి చూపేదాన్ని. కానీ, సాధారణంగా యిద్దరమూ మా స్త్రీ పురుష భేదం మరిచి మిత్రులవలె ఆడుకునేవాళ్ళం. అలాకాక ప్రతినిమిషమూ ఒకరికొకరికి కామ వికారం కలుగజేస్తోవుంటే, ఇరవై నాలుగు గంటలూ కలసి జీవించగలమా? ప్రతి సంజ్ఞా, చూపు, కామవికారంతో స్ఫురించటం, గాలిలేని ఇళ్లల్లోనూ, ఈగలు ముసిరే భోజనాల సావిళ్ళలోనూ. పవిత్ర ప్రేమమయ సంసారాల్లోనూ, అంతేగాని స్వచ్ఛమైన నీళ్ళల్లోనూ, ఎడార్లలోనూనా? అమీర్ అవతల వొడ్డుకి యీది నుంచుంటే ఆ రాత్రి నిశ్శబ్దంలో యెవరో గంధర్వ కుమారుడు వొచ్చి నుంచున్నట్టు కనపడేవాడు. స్నానం అయిం తరవాత తుడుచుకోము. కొంచెం అటూ ఇటూ పరుగెత్తి బట్టలు వేసుకొంటాము. బావుండలేదూ? అదుగో "ఏం బావుండడంలే!" అంటోంది నీ పెదిమల వొంపు. "నీకేం తెలుసు." అని ధైర్యంగా అనగలను నేను.

ఇంక భోజనం భోజనమంటే, ఒకరికెదురుగా ఒకరం కూచునీ, ఒకరినొకరం కళ్ళతో తాగెయ్యడమన్నమాట. మెతుకులమీద బతికామా, ఆనందంమీద కాని....రుషులు వాయుభక్షణ చేసి జీవించినట్టు! మొదట్లో నేనే వేరే తినేదాన్ని. కాని తన యెంగిలి మూతితో నన్ను ముద్దు పెట్టుకుంటో వుంటే, ఏం లాభం మడిగా వేరే మూకుట్లోతిని? నాకు చేతకాలేదు' వేశ్యల ఎంగిలి రుచులు చవిచూసి కూడా కులం నిలుపుకునే నేర్పరితనం మీ శ్రోత్రీయులకి మాత్రమే చాతనవును. ఏం తిన్నానో, యెలా తిన్నానో ఆ భోజనం యెలా సయించిందో నాకు జ్ఞాపకంలేదు; అర్థంకాదు. ఈనాడు మళ్ళీ మా

ఆయన యింట్లో నేను వుండడమే తటస్థిస్తే మళ్ళీ నెయ్యీ, పప్పూ, పులుసూ వుంటేగాని ముద్ద దిగదు. కాని అమీర్ చూపుల కలవరంలో నా మనసు నిండి, అతని పెదవుల రుచి నా నోటిని కరిగిస్తోవుంటే ఏం తింటున్నానో స్ఫురణకి వస్తుందా?

మధ్యాహ్నమంతా గొంగళి వేసుకుని చింతచెట్టు కింద పడు కుంటాము. మన దొడ్లల్లో చింతచెట్లున్నాయి. కాని చింత చిగురుకీ కాయలకీ తప్ప యెన్నడన్నా వాటివంక చూస్తామా? ధైర్యముంటే, యింటికి వెళ్ళగానే, నువ్వు మధ్యాహ్నం దానికింద గొంగళివేసుకొని వెల్లకిలా పడుకుని ఆకాశంవంక చూడు. ఆ సన్నని ఆకులు కట్టే ఆకుపచ్చ అద్దాల మెడలోంచి ఆకాశ నీలపు నిగ్గుల కప్పులమీద తెల్లమేఘాలు తేలిపోతూవుంటే....కాని లాభంలేదు. ఆ అందం కనబడ్డానికీ, కారణంలేని ఆ ఆనందం గుండెల్లో పొంగి, ఆ రంగుల బాధని స్ఫురింప జెయ్యడానికీ, అమీర్ చెయ్యి నీ నడుంమీద వుండాలి! నీ వేళ్ళు అతని మెత్తని జుట్టులో ఆడుకుంటో వుండాలి. కాంతి పల్చని ఆకుల్లో పడితే. పెద్ద మందిరాల్లో కిటికీల్లోనుంచీ, తలుపుల్లో నుంచీ లోపలికిపోకి, తివాసీలు, అద్దాలు, పటాల మీదనించి, అందాన్ని పొందే విచిత్రమైన మెత్తనికాంతి వుంటుందే, అలా కనపడేది ఆ చెట్ల కొమ్మల మధ్య వెలుతురు ఒక్కటే. తమాషా రంగుల పిట్టలు వచ్చి కూచుని, తొంగిచూసి, చిన్న చిన్న పలుకులూ, యీలలూ ఆ ఆకుల గుహల్లోంచి పలికేవి. ప్రేమ చూపుకునేవి, నిశ్చలలైన మధ్యాహ్నం కునుకుపట్టే వేళ ఆ పిట్టలు పలుకుతో పాడుతో వుంటే మనుషులదికాని గొప్ప సంతోషం కలిగి దాన్ని భరించలేక అమీర్ని కావలించుకుంటాను....చూడు అర్థరాత్రి చిన్న వాయువులమీద నువ్వెన్నడూ వినని కొత్తపాట చెవిని తాకితే, యేటి నీటిలోంచి నువ్వెన్నడూ యెరుగని యేదో కొండ గడ్డివేళ్ళ వాసన వస్తే,యెలాగో యేదో మరచిపోయిన సుందరానుభవాలు మనసుకి తట్టవా? అలా స్ఫురించేది ఆశ్చర్యంగా, ఆ పక్షి రెక్కల్లోంచి చిన్న యీకె గాలిలో సోమరిగా తేలుతోవచ్చి వాలేది నామీద. దాని పాటలతోకూడా ఎక్కడో, ఎప్పుడో, ఏ జన్మలోనో అనుభవించి, అధికానందం పొందిన విషయాలు అలా బాధపెడతాయి గావును మనసుని! ఆ పిట్టలన్నీ నాకు గుర్తు. ప్రతి మధ్యాహ్నమూ యెదురు చూసే దాన్ని. ఏదో బంధుత్వం నాకూ వాటికీ వున్నట్టే తోచేది.

అన్ని దిక్కులా రాత్రి కమ్ముకున్నప్పుడు,యీదురు గాలిలో నిప్పు ముట్టించి మళ్ళీ బియ్యం వండేదాన్ని. అంత చీకట్లోనూ, గాలిలోవూగే- వొకటే మంట వెలిగించడం యెంతో గంభీరంగా వుంటుంది. ఇద్దరి మొహాలమీదా వెలుగు చీకట్లు వుయ్యాల లూగుతూ, ఆ పొయ్యి దగ్గర కూచుని వుడికే అన్నపు సంగీతానికి ఆకలితో వుడికేపొట్టలు గంతులేస్తో......... వొంటరిగా లోకానికంతా చక్రవర్తులవలె కూచుంటాము. ఎందుకో విశాలమైన మైదానంలో రాత్రులు ఆకాశంకింద మంట, యేవో యెరగని భావాల్ని కలిగిస్తుంది.

ఒక్కొక్కరోజు అమీర్ మధ్యాహ్నమప్పుడు యేట్లో చాపలు పడతాడు. ఆ చాప బైట గిల గిల కొట్టుకోవడమూ, దాని ముక్కులోంచి నెత్తురు రావడమూ చూస్తే నేను భరించలేను. అతని పక్కన భుజంమీద చెయ్యేసుకుని, బెండు కదిలే సమయానికి అతని తలని లాక్కుని వొదలక గట్టిగా పట్టుకుని ముద్దు పెట్టుకునేదాన్ని. ఉత్తగాలం అతను పైకి లాగినప్పుడు సంతోషిస్తాను. కాని చాలాసార్లు వెర్రిచాప దాన్ని కరుచుకొనే వుండేది. ఒకసారి నాలుగు చాపల్ని అతను చూడకుండా నీళ్ళలో వొదిలి పెట్టాను. ఏవి అని అతను అడిగితే పొదలోకి పారిపోయాయి అన్నాను. ఎట్లా నవ్వాము! మేము స్నానం చేసేటప్పుడు ఆ చాపలు మమ్మల్ని నీటి అడుగన తాకితే, దూడలూ, కుక్కపిల్లలూ అనేదాన్ని. స్వచ్ఛమైననీళ్ళల్లో ఆడే వాటి తోకల్ని చూసి, నేను పరిగెత్తేప్పటి నా పిరుదుల కదలికలాగా వుంటుందని ముచ్చటపడేవాడు అమీర్. అన్నం పడేస్తే అన్నీ వచ్చి మూగేవి. పిచ్చి మూతులు చాచుకుని, వాటి నెట్లా గాలంతో చంపేవాడో!

'వాటిని చంపడం పాపం కదూ!'

'పాపమేమిటి ? దేముడే చంపుతున్నాడు ప్రతి నిమిషమూ లోకాన్ని !'

'అయితే మనుషుల్ని కూడా తిను.'

'కొందరు మనుషుల్ని తప్పకుండా తింటారు. ముఖ్యంగా బొత్ర ప్లీడర్లు బహురుచిగా వుంటారు.'

చాపలు దొరికిన రోజున వేరే పొయ్యిపెట్టి వొడుకుంటాడు. కాని తరవాత వాసన! నా కడుపులో వికారం పెట్టేది. అది చూసి క్రమంగా చాపలు తినటం మానేశాడు. కాని ఆధ్యాత్మిక ప్రేమగల నా భర్త, ఎన్ని సార్లు నేను యేడ్చినా, ఆ ముక్కు పొడుం మాత్రం మానలేదు. 'చాపల వాసన అమీర్, నా దగ్గిరికి రావొద్దు' అంటే ఆ రాత్రంతా దూరంగా కూచుని నన్ను చూస్తో తృప్తిపడేవాడు. నేనే వుండలేక అతన్నిలాక్కుని వికారపడి కక్కేసేదాన్ని పశుకామం! ఏం చెయ్యం?

మధ్యాహ్నం గాలం యేట్లో వేసుకుని, గానుగ చెట్టు నీడలో కూచుని కునికిపాట్లు పడడం యెంత హాయిగా వుంటుందని! ఎండ మచ్చలతో పోట్లాడే నీటి కెరటాలనీ,తొరగా కొట్టుకువచ్చే చెత్తనీ, నురుగునీ, అవతలవేపు నీళ్ళలో వొంగుతూ లేస్తున్న తుంగనీ, దూరపు కొండల మారే రంగుల్నీ, అట్లా సోమరిగా చూస్తో కళ్ళు సగం మూసుకుని, నా జుట్టు అమీర్ మెడమీద యెగురుతోంటే, అట్లానే యేమీ ఆలోచనలన్నా లేకుండా, యింకా కావాలనే కోర్కె, ఆధారాలు ఏమీ లేకుండా పడుకోడం, సుఖాలు వొదిలి పరమాత్మలో యేకమయే ఆనందమంటారే- అలాంటిదేగావు ననిపిస్తుంది.

ఇంక రాత్రులు. యేం రాత్రులని? మాకు వెన్నెల వొచ్చినా సంతోషమే, చీకటిగావున్నా సంతోషమే. మబ్బుపట్టినా సరే అన్నిట్లోనూ ఆనందం కనపడేది. కూచోడం కష్టమైనట్టు కాళ్ళూ, చేతులూ ఆడబోతాయి. ఏదో ఆనందం, యేమిటో చెయ్యమని పురిగొల్పుతుంది. కూచుని వూరికేనా లేక నవ్వుతో పరిగెత్తడం, తప్పించుకోవడం, దాక్కోడం, అందినా అందుకోనట్టూ అందనట్టూ నటించడం, అంతా అనుభవం కలిగినా, ఇష్టంలేనట్టూ, కొత్తవారైనట్టు నటించడం, అలిసి కిందపడగానే రెండోవారుకూడా అక్కడేపడి.... మనుషుల కుండే బద్ధకాలూ, చికాకులూ మర్యాదలూ పోయి అందమైన మృగాలమల్లే, పిల్లి పిల్లలవలె ఆడుకునే వాళ్ళం.

మొదట నా సౌందర్య బాధని పొందినవాడు అమీర్. ప్రపంచమంతా వెతికి నన్నేరుకున్నట్టున్నాడు. ఆనాటి ఉదయం ఆఫీసు గదిలో నా వీపు చూడగానే నేనే తనకి కావాలని, నేను తప్ప ఎవ్వరు అక్కర్లేదనిపించిందని చెప్పాడు.

ఆ రాత్రులు ఈ భూమి మీదేనా, యే ఇంద్రజాల లోకాలలో నన్నాననా, అదంతా కలా, భ్రాంతా, ఈ ప్రపంచమే యింత అందంగా వుండగలదా అనిపించేది నాకు. కాని అమీర్ మాత్రం అమితమైన బాధపడేవాడు. ఒక్కొక్కప్పుడు జాలివేసేది. భయమేసేది. కాని ఆ బాధే తన ఆనందమంటాడు. ఏమిటంటే- ఆనందం చూసి వెర్రెత్తిపోతాడు అతడు. ఒక్క నిమిషం నా వొంటిమీద బట్టని నిలవనియ్యడు. నా రెవికలన్నీ ఒక్క పదిరోజులలో చించేశాడు. మళ్ళీ కుట్టుకోలేదు. ఏం లాభం? చీరెలు చిరిగిపోయినాయి. కాని ఏమైతేనేం? చీరెలు చూస్తాడా అమీర్. నా వొంటిని చూస్తాడు గాని, అక్కడ పేరంటాలా భోజనాలా? చీరెల విలువనిబట్టి మనుషుల విలువ నిర్ణయిస్తారా, మీ వూళ్ళల్లో మల్లే!"

వెన్నెల వొచ్చిందంటే ఆ బయలంతా క్షీరసముద్రమూ, స్వర్గమూ, ఆకాశమూ అయిపోయేది. అమీరంత గొప్ప హృదయం కలవాడు, సౌందర్య పిపాస గలవాడు, అన్నాళ్ళు మా ఊళ్ళో పని లేకుండా ఊరికే ఎలా పడివున్నాడా అని ఆశ్చర్యం వేస్తుంది ......... కొంతసేపు తాకితే నలిగిపోతానేమో, మల్లెపువ్వునో వెన్నెల రేఖనో అన్నట్టు పెదవుల చివర్లతో, గాలిమల్లేనూ, మల్లెపువ్వుల మల్లేనూ, వేళ్ళకొనలతో నీటి, అలల వలెనూ, కుక్కపిల్లలవలెనూ తాకి ఒళ్ళంతా తిమ్మరింతలు పరిగెత్తిస్తాడు. ఊరికే యెదురుగా నుంచుని నన్ను చూసి, వెర్రెత్తినవాడివలె నా పేరు పిలుస్తూ కూచుంటాడు. చేతులతో నా తలని రెండువేపులా పట్టుకుని నన్నేదో ప్రశ్నిస్తున్నట్టు నా కళ్ళలోకి చూస్తో అరగంట నుంచుంటాడు. వున్నట్టుండి నా చీరెనీ ఒక్క ఊపుతో లాగేసి నిర్జీవమైన మైదానం మధ్య నుంచోపెట్టి, చేతులుపైకెత్తించి నా చేతుల్ని, నా రొమ్ముని, అన్ని వేపుల్నించీ అలా రెప్పవేయక చూస్తూ నుంచుని నన్ను పక్కలకి వొంచి నా నడుం దగ్గర సాగే వొంపుల్ని తాకి, వెనకనుంచి నన్ను తనకేసి వోంచుకుని, నా గడ్డం కింద వేళ్ళు కదిలిస్తో, మెడ నున్నతనానికి మురిసి ఆనందించేవాడు. నా భుజాల వెనకచూస్తే నల్లని మబ్బుల్లోని నీటిభారం తోస్తుందిట. నా నడుం వొంపుల్ని చూస్తే మా యేరు చప్పున వొంగి తిరిగినచోట కలవరపడే ప్రవాహపు నునుపు తోస్తుందిట. నా మెడమీద రేఖలు చూస్తే సోమరి అలలమీద మెత్తని యెండ ప్రతిఫలించి మెల్లిగా పైకి ప్రాకేకాంతి గీతలు కనపడతాయట.

అలా అంటో అంటో చప్పున గోదావరి మీద లేచే ఎండాకాలపు తుఫానువలె విజృంభించి నన్ను కావలించుకుని, వూయించి, తిప్పేసి అలవ కొడతాడు. ఒక్కొక్కప్పుడు అతను నన్ను విరిచేస్తాడేమో, తినేస్తాడేమో అన్నంత భయమేసేది నా మొహాన్ని ఆ వెన్నెట్లో ముద్దు పెట్టుకున్నాడంటే, నా వూపిరి ఆగి, కళ్ళు తిరిగి చెమటలు పోసేవి. నన్ను అదుముకుని, యింకా అదుముకుని, ఇంకా తనలో నన్ను కలిపేసుకోవాలని అతను పడే బాధని చూస్తే నేను బతకడమే ఇతనికి ఇష్టంలేదా? ఆ కళ్ళలో వెలిగేది ద్వేషం కాదా అనిపించేది. తన పెదవులతో తనచేతులతో నా నున్నటి శరీరాన్ని వొత్తెయ్యడం, నలిపెయ్యడం, తన కాళ్ళతో నా కాళ్ళని మెలిపెట్టి విరిచెయ్యడం చూస్తే, యితనికి సౌందర్యం, విరోధమా, దాన్ని ధ్వంసం చెయ్యాలని చూస్తున్నాడా అని అనుమానపడతాను.

ఇలా ఒక్క నిమిషం వ్యవధిలేకుండా బాధపడి అలిసిపోయి నిరాశ చెంది, నా పాదాల మీద పడి 'ఎలా? యేంచెయ్యను? యెంతసేపు?' అని యేడుస్తాడు. నిజంగా యేడుస్తాడు. మళ్ళీ చప్పున పళ్ళు పటపట కొరికి, దడిసి వెనక్కి తగ్గే నన్ను యీడ్చి కావలించుకొని, లాక్కుని, పర్వతపు గుహల్లో వీచే సముద్రపు తుఫాను గాలివలె వూపిరి పీలుస్తో, నన్ను భుజం మీద, చంపలమీద యెక్కడపడితే అక్కడ, సున్నితమైన స్థలాల కొరికి చంపేస్తాడు. అతని బరువును భరించలేక కిందపడి పోతాననుకుంటాను. నేను బాధతో అరిచిన కొద్దీ నా పెదిమల రక్తం అలా పీల్చి చంపేసే రాక్షసి కాదుకదా! అని వొణుకుతాను.

సగం చచ్చి పడుకున్న నాకు యెడంగా పడుకుని చేతిమీద తల నానుకుని నా వంక చూస్తో వుంటాడు. నాకు సిగ్గయి అతని చెంపలమీద చేతులు వేసి, 'ఏమిటి అలా చూస్తావు?' అని అడిగితే యేమీ మాటాడడు. నేనట్లా నిద్రపోయి యే మూడు జాములకో లేచి చూస్తే, ఇంకా అట్లా చూస్తోనే పడుకొని వుంటాడు. దుప్పటికిందనుంచి గుండ్రంగా యెత్తుకున్న నా రొమ్ముగర్వాన్నీ, నా భుజాల దగ్గరనించి పిరుదల కిందకి తిరిగే విల్లువొంపునీ, నా చేతుల సన్నతనపు జారునీ, నావొంటిమీద పాకే నాజుట్టుని, దోసెళ్ళలో వుంచుకొని, వేళ్ళలో నుంచి జారుస్తో బుజాలమీదా. మొహం మీదా

కప్పుకుంటో గడిపాడు నాలుగు గంటలసేపు. ఏటిలో రోజూ కడిగి నూనె నెరగని జుట్టు నా మెడమీద అల్లరిగా పడడం అతనికెంతో యిష్టం. నా జుట్టు అతనికి కొత్తగా కోసిన వరిగడ్డి వాసనా, అరేబియా గుఱ్రపు శుభ్రమయిన పరిమళమూ తలపింప జేస్తుందట.

చిన్నప్పుడు మా యింట్లో శాస్తుర్లు భాగోతం చదువుతోంటే విన్న సంగతులు జ్ఞాపకం వొచ్చాయి. విష్ణు భక్తుడికి సర్వ ప్రపంచమూ లీలగా, అసత్యంగా తోస్తుందిట. ఈ భూమీ, ప్రాణులూ, వాళ్ళ సుఖదుఃఖాలూ, సర్వమూ మాయగా, అశాశ్వతంగా తోస్తుందనీ, ఒక్క విష్ణుభక్తి మాత్రమే నిత్యమయినదీ, అర్థవంతమయినదీ, తనకి సంబంధించిందిగా కనబడు తుందని చెప్పేవాడు. నా మనోస్థితి సరిగా విష్ణుభక్తుడిలాగు వుంది? నా యిల్లూ, బంధువులూ, యీ వూళ్ళో ప్రజలూ వాళ్ళ అభిప్రాయాలూ, అన్నీ మాయ. నా పూర్వ జీవితమంతా ఒక దుష్ట స్వప్నం. శాశ్వతమూ, సత్యమూ అయినది నేనూ, నా అమీర్. నిత్య నిరంతరానందదాయకమయినది, మా నిశ్చల ప్రేమ సంబంధం. ఆ కొండలూ, ఆకాశమూ, నదీ, బయలూ, స్వచ్ఛ మారుతమూ, మేము మా లీలకోసం సంకల్పించుకున్న రంగస్థలము-అంతే. ఇంక తక్కిన ప్రపంచమంతా మాయ. మేమే యీ సృష్టీ, దాని వుద్దేశ్యమూ, మమ్మల్నీ, మా ప్రేమనీ సృజించడానికే ఈశ్వరుడు ఈ లోకాలన్నిటినీ యేర్పరిచాడు.

# 3

కాలం ఆగిపోయింది మాకు. తొరగానూ కాదు. ఆలస్యంగానూ కాదు.

వారాలు తెలీవు. నెలలూ తెలీవు. మామయ్య వొచ్చి చెప్పిందాకా. సాయంత్రం మేము భోజనం వొండుతూవుండగా వూళ్ళోనుంచి ఓ కుఱ్ఱాణ్ణి వెంటబెట్టుకుని తన మామూలు పచ్చ రూలుసంచీ, తానూ-మామయ్యే తయారైనాడు. అతన్ని చూడగానే అమీర్ తురకంలో 'పో, పో ఇక్కణ్ణించి' అన్నాడు. మామయ్య భయంతో నా వంక చూశాడు. నేను బిగ్గిరిగా నవ్వి.

"నా మామయ్య అమీర్, పొమ్మనకు మరి" అన్నాను.

నా కెందుకో అతన్ని చూసి భయంవెయ్యలేదు. అమీర్ మొహంలో మాత్రం యిబ్బంది కనబడ్డది నాకు.

"మామయ్యా! ఏమిటి? మీ మామయ్యా? ఎట్లా వొచ్చాడు? ఎందుకొచ్చాడు?"

"...కనుక్కుందాము కూచోనీ .... కూచో మామయ్యా! రాకరాక వొచ్చావు."

అని మళ్ళీ గొంతుమార్చి "బాగానే వుంది. మా పుట్టింటి బంధువులు వొస్తే, యిదేనా మర్యాద!" అన్నాను.

"ఎప్పుడు రావటాలు! విశేషాలేమిటి? అందరూ బావున్నారా!" అని అడిగాను మర్యాదగా.

"ఎవరు యామైతే నీ కేం? నువ్వు సుఖంగా వున్నావుగా!" అంటో చుట్టూ చూశాడు.

"మామయ్యా! ఆ ధోరణికేంగానీ తొరగా బైట పడెయ్యి. ఎందుకు వొచ్చావో?"

నా మాటల దోరణీ నా కొత్త ధైర్యమూ ఆశ్చర్యపడి చూశాడు.

"ఎట్లా మారిపోయినావో?" అన్నాడు మెల్లిగా.

"మరణంలోంచి జీవనంలో పడ్డాను. మరి మారిపోనూ!"

"తురక కూడులో పడ్డావు."

మామయ్యకి మాటల దగ్గిర యెన్నడూ మొహమాటం లేదు.

"మా యింటికి వొచ్చి తురకవాళ్ళని యేమన్నా అంటే, తురక తడాఖా తగుల్తుంది. మర్యాదని యింటి దగ్గిర వొదిలి వచ్చావా" అన్నాడు అమీర్. మామయ్య తృణీకారంగా మాట్లాడకుండా వూరుకున్నాడు.

మెల్లిగా కళ్ళనీళ్లు పెట్టుకున్న నావంక యెగాదిగా చూశాడు. నాకు రెవిక లేదు. జుట్టు దువ్వక రేగివుంది. ముతకచీరె. అన్నంకుండ పొయ్యి మీద. చేతిలో కొయ్యతెడ్డు.

"ఇదిగో! ఏడుపులూ, గోలలూ సాగించి క్షోభపెట్టి నిన్ను లాక్కెళ్లాలని వొచ్చాడు., వీడివెనక తక్కిన మనుషులు వొస్తారు. ఆమూట బుజాన యెత్తుకుని వెంటనే నడవమను" అన్నాడు తురకంలో అమీర్.

"ఏమీ భయంలేదు. ఎవరొస్తే నన్నేం చేస్తారు? మావాళ్ళ విషయం నాకు వొదిలెయ్యి. నువ్వు కొంచెం అట్టా తిరిగిరా. నువ్వుంటే సంగతి చెప్పడు."

"నువ్వు కొంచెం తొరగాకానీ. ఆకలేస్తోంది" అని అమీర్ వెళ్ళాడు.

"నే నిక్కడ వున్నానని నీకెట్లా తెలిసింది?"

"ఎలాగో వోలాగు. కాని నీ సంగతి చెప్పు."

"నా సంగతి ఏముంది? హాయిగా, మహారాజులా వున్నాను."

"అంతేనా!" అని కళ్లు వురిమి చూశాడు నేను జంకకపోవడం చూసి కళ్ళు 'స్విచ్ ఆఫ్' చేసి,

"ఎంతదానవైనావే....! పోనీ అమ్మ సంగతి తలుచుకున్నావా! నీ సుఖం నువ్వు చూసుకున్నావుగాని! ఇలాంటి పని చేస్తే మా అందరికీ యెంత సిగ్గు కలుగుతుందో...."

"నా మమాయ్యని, నువ్వు ఇలా ఆ పిలక వేళ్ళాడేసుకొని, ఆ పాతరైలు సంచీ చంకనెత్తుకుని ఒస్తే నాకెంత సిగ్గుగా వుంది! అమీర్‌తో నా మామయ్య నువ్వని యెలా చెప్పుకోను? నీ సుఖమూ, నీ అందమే నువ్వు చూసుకున్నావు గాని, ఆ పాడు మొహం...."

"ఏమిటి! నీకు పిచ్చి పట్టలేదు కద!"

"కాదు, మామయ్యా మీ అందరూ మన బంధువులలో ఎవరికి ఏమి కష్టం కలుగుతుందో అని ఆలోచించి చేస్తున్నారా మీ పనులన్నీ? చిన్నప్పట్నుంచి నువ్వు మీ అమ్మని యెన్నివిధాలా ఏడిపించావో నీకు జ్ఞాపకం లేనేలేదా!"

"దానికీ దీనికీ సాటి ఏమిటి? మేము యామన్నా తురకాళ్ళతో."

"నాకు తెలుసు మామయ్యా! ఆ యేడిపించడాలు లోకం ఒప్పుకున్నవీ, మర్యాదైనవీ. ఇది కానిదీ! అంతే భేదం. అవన్నీ యెందుకుగాని

యిప్పుడు నువ్వు వచ్చిన పనేమిటో చెప్పు తొరగా, మళ్ళీ అమీర్ ఒస్తాడు. నన్ను ఒదిలి నాలుగు నిమిషాలు విడిగా నిలవలేడు."

మామయ్య మాటాడకుండా నా వంక రెండు నిమిషాలు చూశాడు. చిన్నప్పుడు నేను పెంకి మాటలు మాటాడినప్పుడు బెదిరించడానికి చూసినట్టు. కాని ఈ తురక రాజ్యంలో ఆ మంత్రం పారక, పైపెచ్చు నేను నవ్వడం చేత, అతనికి తీవ్రమైన వుక్రోషం ఒచ్చింది. తన బాణాలన్నీ రావణుడి యడల వ్యర్థమయినప్పటి రాముడివలె.

"సిగ్గులేదుటే. నీ మొహానికి! అంత మరీ చెడిపోయినావుటే! ఆ తురక వెధవ నిన్ను ఒదలలేకపోవడం ఒక గొప్పగా, బడాయిగా...."

"ఒక్క నిమిషం వదలలేని ప్రేమ ననుభవించడం కన్న అదృష్టం యేముంది స్త్రీకి! నీ కర్థం కాదులే"

పళ్లు పట పట కొరికాడు. ఇంకేం చాతగాక!

"ఎందు కర్థమైతుంది? కుక్కలమల్లే, పందులమల్లే-"

ఇంకేవో మాటలన్నాడు. చెడిపోయినదాన్ని నా నోటి నుంచి కూడా రావు ఆ మాటలు.

"పుణ్య పురుషులు, బ్రాహ్మణులు మీరుమాత్రం అంతేగా! కుక్కల కన్న, పందులకన్న, అధమంగా. ఆ మాత్రం చాతగాక-"

ఇంక కోపం చూపించే విధం తోచలేదు మామయ్యకి.

"పాపం, పుణ్యం-సిగ్గూ, యెగ్గూ లేకుండా రాత్రులనక, పగలనక యీ అడవిలో దున్నలవలె పడి-యెందుకు యీ బతుకు బతకడం యింతకంటె దేంట్లోనన్నాపడి చావరాదూ?"

"మొదట్లో నా ప్లీడరు పెనిమిటీ ఓ వారం యిట్లానే వుండేవారు. తరవాత శక్తీ, రసికత్వమూ, తగ్గి, పవిత్ర పురుషుడైనాడు. ఆయన్ని యేమీ అనరేం!"

"పవిత్రమయిన కాపరానికీ, యీ గుడిసేటితనానికీ సాటి తీసు కొచ్చావా? నీ నోరుపడ?"

"మరి ఆ పవిత్రమయిన కాపరంలో కంటె, యిక్కడే ఆనందంగా ఆరోగ్యంగా వున్నానే!"

"ఉండదూ? ఆనందంగా వుండదూ మరి! అడ్డూ, ఆటంకమూ లేకుండా కులమూ, గోత్రమూ లేకుండా...."

"ఎంత అసహ్యంగా, క్షోభగా కుళ్ళుగా వుంటే అంత పుణ్యమన్నమాట!"

"ఎందుకు అసహ్యంగా వుంటుంది. దుర్బుద్ధికి అలా తోచింది గాని"....

"ఆ దుర్బుద్ధి మీ పెంపకంవల్లనా? లేక అలాంటిదాన్ని మీ అక్క కన్నదా? దేవుడిచ్చిన బుద్ధికి ఇంక మీరు యేడ్చి యేం ప్రయోజనం?

"వీపు చీలిస్తే బుద్ధి కుదుట పడుతుంది."

"సమయం మించిపోయింది."

ఆలోచిస్తున్నాడు.

"వూరికే పేర్లతో మనకీ తగాదా యెందుకు మామయ్యా!"

"అంటే."

"అదే! పవిత్రం, అవినీతి, పశువులమల్లే పాతివ్రత్యం .... యిలాంటి మాటలకి శాశ్వతంగా అర్థాలు ఏర్పడ్డాయి. వాటి నిజమయిన అర్థమేమా అని మనుషులు ఆలోచించడం మానేశారు..... నిజం చెప్పినా- మనుషులమయిన తరవాత మన వాంఛలన్నీ వొకటే. తురకాడైతేనేం, బ్రాహ్మణుడైతేనేం. కాని ఇక్కడ సంతుష్టిగా, నిర్భయంగా అనుభవించడానికి వీలుంది. అక్కడ మాయమాటలతో, ఆధ్యాత్మికమని, యీశ్వరుడి మీద భారంవేసి, చివరికి అనుభవించడానికి జంకుతాము. ఇంత కామమూ, పోనీ అనుభవించడం చాతనైతే బావుండుననే కోర్కె అక్కడా వుంది. కాని ఈ రసికత్వమూ, ఈ సత్తువా అక్కడ లేవు. అందుకనే కుళ్ళు వాయువులూ, బోధనలూ, వేదాంతాలూ, మర్యాదలూ, కచేరీ కబుర్లూ ఎక్కువ అక్కడ...."

"వూరికే యింక మనసెలా యీడిస్తే అలాపోయి, బాగా యీ శరీర సుఖాలు అనుభవించడమేనన్నమాట యీ బతుక్కి అంతం?"

"అక్కడ వున్నా అంతేగా? తినడమూ, నిద్రా, మర్యాదా, చాకిరీ, అంతేగా! వాటివల్లే ఏదో పుణ్యలోకాలు వొస్తాయని దొంగ బోధనలు పైగా."

"మరి ధర్మమూ, పతిభక్తీ, సంసారమూ ఇవన్నీ?"

"ఎందుకు మామయ్యా, ఆ పేర్లన్నీ యాకరువు పెడతావు? ఎవరికి కావాలి అవన్నీ! తంతాడనీ, తిండి పెట్టడనీ, వేరు గతిలేకా, అనుభవించడం చాతకాకా. అంతమాత్రం ధైర్యమూ, రసికత్వమూలేకా, మొహాన్ని, చూసి ముచ్చటపడేవారు లేకనేగా ఆ పతిభక్తి, పవిత్రతా! ఆ మొగుడి నించే తిట్లూ తన్నులూ తిని అడ్డమయిన చాకిరీచేసి, తగాదాలు పడి, పొట్లాటలతో కాలం గడుపుతో చస్తే, మోక్షమా! ఏ దేవుడు చెప్పాడు."

"మరి త్యాగమంటో లేదా ఏమిటి?"

"నా అమీర్‌కోసం నేను చేసిన త్యాగాలూ...."

"చాల్లే! ఇంక పశువుకి నీకూ భేదమేమిటి?"

"ఏమీలేదు. ఇదివరకు పశువుకన్న అధమమయిన బతికె బతికే దాన్ని. ఇప్పుడు పశువునై సుఖపడుతున్నాను."

"ఇంక తల్లీ తోడు...."

"అక్కడ.... ఆ చివాట్లలో.... అసహ్యాలలో యెన్నడూ జ్ఞాపకం వొస్తారు తల్లీ తోడూ - సంతోషమనేది చిన్తనంతోనే సరి. అందువల్ల అన్నలన్నా తమ్ములన్నా అంత ప్రేమ. ఇక్కడ యీ దివ్య సౌఖ్యంలో యెవరూ జ్ఞాపకం రారు. నిజమయిన అత్తవారిల్లు, అందర్నీ మరిపించే స్వర్గం."

"ఇంకెప్పుడూ యింతేనన్నమాట. మళ్ళీ యింటికి రావడమూ అదీ లేదూ?"

"నన్ను రానిస్తారా?"

"రానిస్తే వొస్తావా మరి?"

"నేనా వొచ్చేది! నేను రాకేం! ఎందుకు వొస్తాను?"

"ఇదే శుభ్రంగావుందా నీకు, ఈ కుండలూ, బొచ్చులూ, యీ అవతారమూ-"

"ఎందుకు అబద్ధాలు మాట్లాడుతావు? అద్దాలు లేకపోతేనేం ఆ యేరులేదూ? అమీర్ నేత్రసరోవరాలులేవూ? నా పాప చూసుకోడానికి! అయినా అమీర్ చూపులకి బావుంటే చాలదా నా అవతారం."

మామయ్య మౌనవ్రతం పూని కూచున్నాడు, అమీర్ వొచ్చాడు.

"అప్పుడే వొచ్చావేం! మేమింకా ఉపోద్ఘాతంలోనే వున్నాము. మళ్ళీ కొంచెం వెళ్ళిరా."

మళ్ళీ వెళ్ళాడు పాపం.

"చూశావా ఎట్లా వెంట తిరుగుతాడో. ఒక్క నిమిషం వొదలక! నా భర్తలేడూ ఆయన వారంరోజులకి ఓ సారైనా నా మోహం చూసేవాడు కాడు. తలంటి పోసుకుని, తల్లో మరువం జాజిపువ్వులు పెట్టుకుని కొత్త సిల్కు చీరె కట్టుకుని దగ్గిరికి వెడితే, కాయితాల్లో తల పెట్టుకుని....

"మొన్న నీ చేతికి పదిరూపాయల నోటిచ్చాను కదా, అది కావాలి. ఒసారి తెచ్చి యియ్యి" అన్నాడు. ఇచ్చిన తర్వాత తలెత్తి చూసి,

"మొన్న తెప్పించిన శికాయి అంతా కర్చు పెట్టేశావా?" అన్నాడు. నవ్వుతోనేలే? అయితే మాత్రం....?"

"ఎంత పొగరెక్కిందే నీకు! అతను తలుచుకుంటే యీ వెధవని ఖైదుకి పంపగలడు తెలుసునా?"

"ఆ, ఈ వెధవ తలుచుకుంటే ఆయన్నీ నిన్నుకూడా తలకాయ పగలకొట్టి, ఆయిక్కడ పాతెయ్యగలడని కూడా తెలుసుకో"

"సరే నువ్వొక్కణ్ణించి కదిలి రావన్నమాట. నాకు ముందే తెలుసు నీ మతం. కానీ, వాళ్ళందరూ పోరి యింకా సంగతులు బయటికి రాకముందే నిన్ను తీసుకొచ్చి దిగబెట్టమని పంపారు."

"మరి నేనేమయినా ననుకుంటున్నారు?"

"పుట్టింటికి వెళ్ళావని చెప్పుకు చస్తున్నారు."

"నమ్మేరూ?"

"అందరికీ తెలుసులే. కాని మాతో అనడానికి ధైర్యమేదీ? మా మాట నమ్మినట్టే నటిస్తున్నారు. ఆ గతికి తెచ్చావు మమ్మల్ని నిన్ను పెంచి పెద్దదాన్ని చేసినందుకు."

"పాపం. మర్యాదస్థులకి యెన్ని బాధలు! మీ దొంగ మర్యాదలూ, అబద్ధాలూ కాపాడ్డానికి నేను మళ్ళీ ఆ నరకంలోకి వొచ్చి వుండాలా? ఎందుకు రావాలి?"

"ఎందుకేమిటి? ఏదో ఓసారి తెలివితక్కువ పనిచేస్తే, పెద్దవాళ్ళ మాట విని అన్నా సర్దుకోవాలి. ఏదో యిట్లాంటివి ప్రతివారూ చేస్తారు. కాని అదే బావుందని, భ్రష్టయై నాశనమౌతానని పట్టుపట్టేదాన్ని నిన్నొక్కదాన్ని చూసా నీనాటికీ."

"అవును. నేను ఁరాను, రాను."

"ఈనాడిట్లానే అంటావు. ఎన్నాళ్ళులే వీడి మోజు! తరవాత నీకు దిక్కెవరు!"

"నారాయణుడు. కాని అమీర్ ప్రేమ పోదు."

"ఆ, చాలా చూశాము!"

"సరేకాని యీ దయంతా నా కోసమేనా?"

"పోనీ, అమ్మని తలుచుకో. నిన్ను పెంచి పెద్దదాన్ని చేసి, యేదో మా అందరికి ప్రతిష్ట తెస్తావని...."

"అవన్నీ చిన్నప్పుడు కుమారీశతకంలో చదువుకున్నాను. దానికేం! నాసౌఖ్యమే మీరుకోరేవారైతే, యిక్కణ్ణించి తీసుకెళ్ళేందుకు ప్రయత్నం చెయ్యరు. అయినా నేనిప్పుడొస్తే మాత్రం లోకమంతా ఎలా చూస్తుంది? ఆ కాపరం యెంత రమ్యంగా వుంటుంది? లేచి పోయిందని చూద్దామని అందరూ రావడమూ, గుమ్మంలోకి వొచ్చి మొహాలు మర్యాదగా మార్చుకోవడమూ, నేను లోపలికి వెళ్ళగానే నవ్వుకోవడమూ, వాళ్ళు నాసంగతులేమీ తెలీనట్టే మాట్లాడడమూ, దొంగ మర్యాదలూ, యెవరన్నా ధైర్యం గలవాళ్ళు నన్ను కార్యానికి పిలవకపోతే, నా భర్త ఆ అవమానం నావల్ల కలిగిందని యాడవడమూ, తిట్టడమూ, దెప్పడమూ, నేనే స్వేచ్ఛ నడిగినా, బైట తొంగిచూసినా, నా పూర్వ ప్రవర్తనని జ్ఞాపకంచేసి నోరు ముయ్యడమూ- దీనికేగా నన్ను రమ్మంటున్నావు! నేను పిచ్చిదాన్నా."

"ఏనాటికన్నా మా గుమ్మం తొక్కవా-" అంటున్నాడు చాలా కోపంగా పైకిలేచి.

"అమీర్ వొదిలేస్తేనా? అమీర్ నన్ను వొదిలేసిన తరవాత, నేనేమై పోతేనేం? ఇంక ఆ లోకంలోనే శరణ్యం. మీ గుమ్మాలు తొక్కుతానని యేమాత్రం భయం లేకుండా బతకండి."

అమీర్ వొచ్చాడు. అతని వొంక నిదానంగా పరీక్షించి చూశాను. ఈ అమీర్ నన్ను వొదులుతాడా?

అమీర్ కళ్ళలో ఆకలి ఆడుతోంది.

"మామయ్యా, నీ భోజనం సంగతేమిటి?"

"నేను పళ్ళు తెచ్చుకున్నాను."

"ఇక్కడ గడ్డి కూడా వుంది"అన్నాడు అమీర్.

పడమటి కొండ వెనకాల రంగుల మబ్బుల్లో శుక్రుడు అస్తమి స్తున్నాడు. తామర పువ్వుమీది మంచు బొట్టుమల్లే. గాలి నిశ్శబ్దంగా వుండడం వల్ల యేరు కొండమీదినుండిపడే శబ్దం వినబడుతోంది. చీపుర్లూ, నేపాళాలు పగలు రాత్రిగా మారే విచిత్రాన్ని చూస్తో కదలక నుంచున్నాయి. పగటి గట్టుమీద నుంచి సరస్సులో దూకటానికి సంశయించే దానివలె ఒక్క నిమిషం ఆగింది కాలం. హృదయం ఒక్కసారిగా ఆనందంతో పొంగింది. పొయ్యిమీది వేడెక్కే అన్నంవలె. మమాయ్య అరటిపళ్ళు తింటో యెదురుగా కూచోకపోతే, ఆ ఆరటమంతా అమీర్‌మీద కనపరచేదాన్ని.

ఒక గంటసేపు మాబంధువుల్నీ, వాళ్ళ. క్షేమాల్నే అడుగుతో కూచున్నాను. మామయ్యతో మాటాడుతోవుంటే మూడునెలల కిందట నా జీవిత దృష్టినంతా ఆక్రమించుకున్న యీ బంధువు లందరూ యెంతో దూరమై పోయినట్లుగా తోచారు. నేను చచ్చిపోయి, అన్ని బంధనాలు తెంచుకొని మళ్ళీ వాటిని కల్పించకునే ఆశా, శక్తీ లేక, యేం తోచక తమాషాకి ప్రశ్నిస్తున్న ట్టుంది, భూలోకంనించి వచ్చిన మామయ్యని. మృత్యువులోనైనా అంతే గావును!ఈ ప్రపంచాన్నీ, ఎత్తయిన, విశాలమైన, సంబంధ రహితమయిన వున్నత దృష్టితో లీలగా పరీక్షించడం గావును! దృష్టికోణం భేదించి అమీర్ అనే నేత్రయంత్రంలోంచి చూసేటప్పటికి అన్ని విలవలూ మారిపోయినాయి.

చివరికి అన్నయ్యకి కొడుకు పుట్టాడని విన్నప్పుడైనా నాకేమీ సంచలనం కలగలేదు. పూర్వమే అయితే నా హృదయం యెన్ని ఉత్సవాల వాసనలతో గంతులువేసి వుండును! ఆ క్షుద్ర జీవితమంతా జ్ఞాపకం వొచ్చి ఆ తోచక పోవడమూ, మర్యాదలూ, లాంఛనాలూ, నిష్టూరాలు- అన్నీ తులుచుకుని, ఆ నరకంనించి, అల్పత్వం నించి, క్షుద్రత్వం నించి ఒక్క మంత్రంతో, ఒక బలమైన వూపుతో యీ సుందర లోకంలోకి లాక్కొచ్చిన నా అమీర్ని తలుచుకుని కృతజ్ఞతతో ఆనందంతో తల్లడిల్లి పోయినాను. ఎంత గొప్ప సౌఖ్యంలో వున్నా, అది త్వరలోనే అలవాటై సాధారణ మయిపోతుంది- మామయ్యవంటివాడు వొచ్చినా, అదృష్టాన్ని జ్ఞాపకంచేసిందాకా!

అమీర్ని లాలించాలని అవసరమయిన కోర్కె కలిగింది. ఈ మామయ్యని పోనీ, కాని మామయ్యని నేనెందుకు లక్ష్యపెట్టాలి! అతనెవరు? నేనెవరు? ఈ మామయ్య మూలానా నేను పోగొట్టుకొన్న నిమిషాలు యీ అనంతకాలంలో మళ్ళీ నాకెక్కడ దొరకుతాయి? ఆవలించే అమీర్ దగ్గిరిగా జరిగి, అతని బుజంమీద చేతులేసుకుని అనుకుని కూచున్నాను. మా కొండ వెనకనించి తదియ చంద్రుడు కనబడకుండానే కాంతి నెగజిమ్ముతున్నాడు. సముద్రానికీ, చంద్రుడికీ సంబంధముందంటారే అలాంటిదే వెన్నెలకీ నా రక్తానికీ వుంది. చంద్రోదయంలో వెన్నెల ఇంకా విజృంభించకముందే నా రక్తం పొంగుతుంది. వెడదామని అమీర్ నా చేతిని లాగుతున్నాడు. పాపం, ఒకే మూకుట్లో అమీర్తో నేను అన్నంతినే దృశ్యం భరించలేక తలతిప్పుకుని పుణ్యశ్లోకాలు చదువుకునే మామయ్యతో.

"మేము వెడుతున్నాము. నువ్విక్కడే నిద్రపోతావు కదూ మామయ్యా!" అన్నాను.

"ఇక్కడా? మీరెక్కడికి వెడతారు."

ఆ కంఠం వినితీరాలి.

"అలా పోతాము."

"తొరగా రా" అంటున్నాడు అమీర్.

"నేను వెడతాను, రైలెన్నింటికి?"

నేను నవ్వాను.

"రైలు సంగతి మా కెందుకూ?"

"పోనీ నన్ను ఊళ్ళో వొదిలిపెడుదురూ!"

"అమీర్ యిప్పుడు రాడు. నేను రానివ్వను. ఇవ్వాల్టికి యిక్కడే మామయ్యా! నువ్వు. ఆ మూల గోనిపట్ట వుంది. దాన్ని పరచుకుని పడుకో. దోమలు లేవులే."

"ఏమీ భయం లేదు కద!"

"అప్పుడప్పుడూ ఒకటి రెండు పాములూ, ఒకటి రెండు తోడేళ్ళూ వొస్తోంటాయి" అన్నాడు అమీర్.

అమీర్ మళ్ళీ తెలుగు మాటాడాడు. ఎన్నాళ్ళయింది విని! నా తెలుగు తురకంగా మారిందన్నాడు మామయ్య.

"రావు మామయ్యా! అమీర్ మాటలకేం?"

మేము బయలుదేరాం, మామయ్య గొణుక్కుంటున్నాడు.

"నీకు మామయ్య అయితే, నాకేమౌతాడు?"

"తురకాడికి నీకేమౌతాడు? నీ మొహం!"

"అది కాదు, నీ పెనిమిటిని నేనైతే-"

"నువ్వు నా పెనిమిటివైతే, యింకా నీతో వుండవొచ్చానా?"

చంప చళ్ళుమంది.

"చెపుదూ! తమాషా చేస్తాను."

"బాబాయి."

"బాబాయిగారూ, శలవు. బతికివుంటే రేపు పొద్దున్న చూసుకుందాం. తమరు కనపడక ఎముకలు మాత్రమే వుంటే నమాజ్‌చేసి పాతేస్తాం. తురక స్వర్గం చూద్దురుగాని."

ఇద్దరమూ నవ్వుతో పరిగెత్తికెళ్ళాం. కొంచెం దూరం పోగానే నాకు జాలేసింది. పాపం నిజంగా మామయ్య భయపడుతున్నాడేమో! ఇదివరకంతా

నేను తనదాన్ని లాగు అధికారం చేసిన మామయ్యకి యెట్లా వుంటుంది-నేను అమీర్ బుజంమీద చెయ్యేసి వెళ్ళిపోతూవుంటే ! వెనక్కి వెళ్ళేటప్పటికి మామయ్య గుడిశంతా వెతుక్కుంటున్నాడు.

"మామయ్యా! నువ్వేం భయపడకు? ఊరికే దడిపించాడు అమీర్. బహుశా రెండు మూడు గంటలవేళ వొచ్చేస్తావేమో?"

"పోనీ వుండకూడదుటే! ఎక్కడికి వెడతా రీ అర్థరాత్రి!ఏదన్నా పురుగూ...."

నాకు నవ్వొచ్చింది.

"ఇంకా ఇంటి దగ్గిర వున్నట్టే, నా బాధ్యత తీసుకుంటున్నావా!"

"ఇదిగో చూడు. మళ్ళీ నీతో మాట్లాడ్డానికి వీలుంటుందో లేదో! నా మాట విని యింటికి వొచ్చెయ్యి. ఈ పాడుబతుకు...."

"మామయ్యా అదేమీ లాభంలేదు. నాకోసం నువ్వేమీ దిగులుపడకు"

"నువ్వు చేసిన యీ ఘనకార్యాన్ని చూసి నువ్వే గర్వపడడం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. ఇదంతా గొప్ప ప్రేమ అని గావును నీ ఉద్దేశ్యం! ప్రేమ!"

"ప్రేమా! పశువులు-కుక్కలన్నా నయం. నీతీ జాతీ విచక్షణలు లేక, కళ్లు కమ్మి వొళ్ళు కొవ్వి, ఇట్లా బట్టలు విప్పుకొని యీ అడవుల్లో పరుగెత్తుతో, సిగ్గువిడిచి...."

"ఇది ప్రేమా! కామం. వొళ్ళు తెలీని పశుకామం....మదపిచ్చి."

ఇంకేమిటో అన్నాడు.

"చాలు మామయ్య!"

అని పరుగెత్తుతో వెనక్కి తిరిగి చూశాను. ఎదిగిన ఆడది పరిగెత్తడమేమిటి? పొగరు! దీని చెంపలు వాయించేందుకు వీలైతే బావుండుననే చూపుతో మామయ్య నుంచుని వున్నాడు వెన్నెల్లో.

పొద్దున్నే మామయ్య వెళ్ళేప్పుడు అమీర్!

"బాబాయిగారూ! యింకా మీ వూళ్ళో వున్న తాతలూ అత్తలూ వొస్తారేమో! మిమ్మల్నంటే బాబాయిగారని వూరుకున్నానుగాని, యింకెవరన్నా వొచ్చారా ఇక్కడే పాతేస్తానని చెప్పండి" అన్నాడు.

"నరుసుబావ నోసారి రమ్మన్నానని చెప్పు" అని నే ననబోతో వుంటే నోరు నొక్కాడు.

నరుసుబావా, నేనూ చిన్నప్పుడు ఆడుకున్నాను. అతనికి నన్నిస్తామని కూడా అనుకున్నారు. కాని అదేమీ మనసులో లేకుండా నాతో చాలా సరదాగా వుండేవాడు. ఎవరితోనూ నన్ను చనువుగా వుండనీని (చివరికి తనతో కూడా) నా పెనిమిటి, నరుసుబావతో సరదాగా మాటాడనిచ్చేవాడు. నరుసుబావ ఆడవాళ్ళ మధ్యకు వొస్తే మొగవాడు వచ్చినట్టే ఫీల్ అయ్యేవారు కారు.

ఏమీ తోచనప్పుడు నరుసుబావ వస్తే బావుండుననేదాన్ని అమీర్‌తో.

"రానీ. వాన్ని నరుసు దెయ్యంగా మారుస్తాను" అనేవాడు.

నరుసుబావ సుగుణాన్ని యెంత పొగిడినా అమీర్‌కోపం తగ్గలేదు. ఒకసారి చివాలున లేచి....

"వొరే నరుసుబావా, వొచ్చావా! చివరికి" అని అప్పుడే వొచ్చిన నక్కనోదాన్ని రాళ్ళతో మైదానం చివరిదాకా తరిమాడు. అప్పణ్నించి నక్క కనబడినప్పుడల్లా నరుసుబావ అంటాడు. తరవాత కోపమొచ్చింది గావును. మాకు కనపడకుండానే నరుసుబావ చాలా అల్లర్లు సాగించాడు. సగం కొరికిన బొమికల్ని మా గుడిశలో పారేశాడు. అదేం పుట్టిందో పడుకుంటే కాలివేలు మెల్లిగా కొరికి లేపుతాడు. మూతపెట్టుకున్న అన్నం కింద చిమ్మిపోతాడు. అట్లాంటి పనులు ఏం జరిగినా, నరుసుబావ చేసి పోయినాడనే వాడు అమీర్. కొన్ని పనులు అమీర్ చేశాడని నా నమ్మకం. కాని పాపం నరుసుబావ లేకుండా చూసి, అతన్ని నక్కని చేశామే అని దిగులువేసేది నాకు. బావ-అతని లావు వొళ్ళు, గుండ్రని బుగ్గలూ, అమాయకత్వమూ నా మీద ప్రేమా జ్ఞాపకం వొచ్చి సిగ్గేసేది.

# 4

**అమీర్** దిగులుపడ్డాడు. అతని తరహా పూర్తిగా మారిపోయింది. అన్నం తినడు. వూరికే వదలకుండా పడుకుంటాడు. పలకరిస్తే విసుక్కుని ముసుగు పెట్టుకుంటాడు. అది జబ్బో. మనోవ్యాధో, నా మీద కోపమో,

విసుగో తెలీటంలేదు. ఒక్కత్తెకీ నాకు ఏమీ తోచక, దిగులుభారంతో యిటూ అటూ తిరుగుతున్నాను. ఆలోచించి కనిపెట్టి మీరా అనే కుర్రాడు వొచ్చినప్పుడు మాత్రం లేచి అతనితో యేదో రహస్యముగా మాట్లాడుతున్న సంగతి గ్రహించాను. చాలాసార్లు అతనితో కలిసి వూళ్ళోకి వెళ్ళివస్తాడు అమీర్. వొచ్చాక మరీ దిగులుగా వుంటాడు.

ఆ కుర్రాడు మీరాని చూస్తే నాకు సరదా. అమీర్తో మాట్లాడుతో వుంటే యెందుకో అతన్ని పిలిచి పలకరించి కబుర్లు చెప్పాలనిపించేది. అట్లాంటి తమ్ముడు వుంటే బావుండును. కొడుకు వుంటే బావుండును. అనుకుంటాను కాని నన్ను అనుమానంతో, విరోధంతో భయంతో చూసేవాడు. దానివల్లనే నాకు తోచింది. నాకు వ్యతిరేకమయినపని ఏదో తలపెడు తున్నాడని, అమీరికి బోధిస్తున్నాడని. నేనతనికి విరోధం యెందుకు కావలసి వచ్చింది? నేనేం చేశాను? పైగా మీరావల్ల అమీర్ మనసు చెడిపోతున్నట్లు కనబడుతోంది.

వ్యవహారం ముదురుతోంది. అమర్ని అడిగితే లాభంలేదు. ఎన్ని ప్రశ్నలడిగినా దాస్తున్నాడు. మీరా దగ్గర్నించే నేను తెలుసుకోవాలి. కాని మీరా చెపుతాడా? నావంక అంత కోపంగా చూసేవాడు! కాని అమీర్ క్షేమం కోసం నేను ఆ ప్రయత్నం చెయ్యాలి.

ఆ సాయంత్రం యేరు వొంటరిగా దాటి యిసికలో నడుస్తో అవతలి గట్టుకు చేరుకున్నాను. సూర్యుడు మైదానం చివరి భూమిని తాకుతున్నాడు. చిన్న గాలిలో గడ్డి నా పాదాలకేసి వొంగింది. ఇసిక గుంటల్లోని పిచ్చిక లెగిరి చెట్లమీద కూచుని నన్ను చూసి విసుక్కుంటున్నాయి. చాపల ఆశని వొదిలి నీలపు పిట్టలు గూటికి ప్రయాణం కట్టాయి. కొంగలబారు నా తల మీద వెడుతో లోకంలో నా వొంటరితనాన్ని గాఢంగా స్ఫురింప చేసింది. ఒక్కడూ పాడుకుంటూ మీరా వొస్తున్నాడు. నన్ను చూసి ఆశ్చర్యపడి ఆగి, చప్పున తలొంచుకొని నన్ను దాటి వెళ్ళిపోవాలని చూశాడు. పిలిచి ఆపి దగ్గరికి వెళ్ళాను ముందే.

"నాతో చెప్పవా?" అని అడిగాను.

సిగ్గుపడి తెప్పరిల్లి 'ఏమిటి?' అన్నాడు.

"ఆ సంగతి-నువ్వు తెచ్చే కబురు."

"ఏం లేదు."

అని వెళ్ళిబోతున్నాడు. చిరునవ్వుతో అతనివంక చూస్తో అతని భుజాలమీద చేతులువేసి, దగ్గిరికి వొంగి, నా కళ్ళల్లో మార్దవత్వాన్ని కల్పించి "నాతో చెప్పవా?" అన్నాను సొగసుగా.

తడబడ్డాడు. "ఏంలేదు ఏంలేదు" అని మెల్లిగా తనలో తను అనుకున్నాడు. అతని గడ్డంకింద చెయ్యేసి కళ్ళల్లోకి చూస్తో "నాతో చెప్పాలి. నన్ను చూస్తే నీకెందుకు విరోధం? నేనేం చేశాను? నాకేదో ఆపద కలిగిస్తున్నావు. నా అమీర్ మనసుని పాడు చేస్తున్నావు. ఇంత మంచివాడివలె కనబడు తున్నావే....ఇంత అందంగా వున్నావే....నువ్వు ఇంకోళ్ళని, దిక్కులేని స్త్రీలని క్షోభపెట్టడం న్యాయమేనా? నీకే అక్కవుంటే యిట్లా యేడిపిస్తావా?"

నా కళ్ళు నీళ్ళతో నిండాయి.

"నేనేం చేశాను?" అన్నాడు మెల్లిగా.

"ఏం చెయ్యకపోతే, చెప్పు."

అమీర్ రహస్యం యింకొకరికి చెపుతున్నానే అని భయం ఒక మూల.నా కళ్ళు చూసి భరించలేకపోవడం ఒక మూల. కదిలే నీళ్ళలో కాంతి ప్రతిఫలిస్తున్నట్టుంది అతని మొహం. కాని అమీరే జయించాడు. మాట్లాడక తప్పించుకోవాలని చూస్తున్నాడు. అతని కళ్ళలో సౌందర్యారాధన నాకు కనబడ్డది గావును, జయిస్తానని రూఢిగా తెలిసింది. ఎందుకంటే ఒక పురుషుడు అందులో అమీర్ వంటి రసికుడు, ప్రేమించిన తరవాత స్త్రీకి తన సౌందర్య మహిమ గోచరించకుండా వుండదు.

"అబ్బాయీ, ఇట్లా చూడు. నా బాబువి కాదూ! నాతో చెప్పవా?" అని మార్దవంగా అని, "చెప్పాలి. చెపుతావు, నాకు తెలుసు" అని చిన్న చిరునవ్వుతో పలికాను.

వెంటనే నాకు సిగ్గేసింది, నా ఆకర్షణని అట్లా వుపయోగించడం! కాని నా ఆనందమే భగ్నమౌతో వుంటే! మీరా యెడల అన్యాయమనిపించింది.కాని నీళ్ళలో మునిగే మనిషి ఏం ఆలోచిస్తుంది? వశ్యుడైనాడు. కదలలేక నా వంక చూస్తో నిలబడి చెప్పేశాడు. అమీర్‌తో మాత్రం చెప్పవద్దని బతిమాలాడు.

"ఆ వూరి తోళ్ళసాయేబు కూతురిమీద అమీర్‌కి మనసు కలిగింది. ఆ పిల్ల అతన్ని నిరాకరిస్తోంది. మీరా ఆ అమ్మాయి బంధువుడు. ఇద్దరికి రాయబారం నడుపుతున్నాడు. ఈ సంగతి చెప్పి మీరా నన్ను అక్కడే వొదిలేసి తప్పించుకొన్న లేడిపిల్లలా గంతేసి వెళ్ళిపోయాడు.

నేను యింటివేపు మళ్ళి, మెల్లగా యోచిస్తో నడుస్తున్నాను. భూమి దోవని చీకట్లో దాచుకుంది తాటిచెట్టు పూనిన దానివలె గాలిలో మెల్లిగా వూగుతోంది. కీచుకీచుమనే మైదానపు శబ్దాలతో తాటాకుల చప్పుడు కలిసింది. ఏదో రొద మొదలు పెట్టింది.

చివరికి నా గతి యిలా అయిందా? యింక యేం కాను? అమీర్ని ఆకర్షించే శక్తి పోయింది నాకు? అనే తలపు నన్ను బాధ పెట్టింది. నా ఆనందానికీ, జీవనానికీ వున్న పట్టు వొదిలింది. ఇంక పతనానికి అంత మెక్కడో? ఈ వొక్క కొమ్మనీ నమ్ముకుని, అన్ని ఆశ్రయాలనీ తన్నేశాను. ఇది యిట్లా పెళ్లుమని విరిగింది. నేనేంకాను? ఏది దిక్కు? అమీర్ మీద అమితమైన కోపం కలిగింది. ఇట్లా వొదిలేవాడవు నన్నెందుకు తీసుకొచ్చినట్లు? తన సౌఖ్యమే గాని నట్టేట్లో వొదిలితే, నా జీవితమేం కావాలనుకున్నాడు?

ఏటినీళ్ళు కాళ్ళన పెనవేసుకుని తమని చూడమని ప్రాధేయపడ్డాయి. నా హృదయారాటాన్ని చల్లార్చాలని సాయంత్రపు గాలి నా పైట కింద నించి రాసుకుంటో వెంబడించింది. ఏం చెయ్యను?

మామయ్య అన్న మాటలే నిజమేమో! ఇలా శరీర ఆకర్షణకి లోబడి జీవితాన్ని వప్పగించుకున్న దౌర్భాగ్యుల గతి యింతే గావును! ఉద్రుతమూ, నిరాటంకమైన మోహానికి అంతమింతేనేమో! ఏ నిగ్రహమూ నియమమూ లేకుండా, యింకొకరి భార్య అని యోచించకుండా నన్నుకోరిన అమీర్, నన్ను వొదిలి యింకోర్ని మోహించడంలో ఆశ్చర్యమేముంది? ఎంత అసహ్యంగా వున్నా సంఘ నిర్మితమైన సంసారంలో, కొంత శాశ్వతత్వం కాలంవల్ల యేర్పడి ఛేదించడానికి సాధ్యంకాని బంధనాలున్నాయి. ఇక్కడా? వెర్రిదాననైనానా? మామయ్యే చివరికి వివేకవంతుడా...." ఇలా అనుకుంటో గుడిసె చేరుకున్నాను.

సమస్త ప్రపంచమూ అంధకారమైనట్టూ, లోకంలోని విచారమంతా తనని బాధిస్తున్నట్టూ నేనూ, నా వొంటరితనమూ; తనకేమీ సంబంధము లేనట్టూ గుడిసె మూల పడుకున్న అమీర్ని చూసేటప్పటికి నా బాధా, న్యూనతా, భయమూ, నిరాశా-అన్నీ నా మనసుని వుద్రేకింప చేశాయి. రోషంలో నోటికి వచ్చినట్టు తిట్టేశాను. లేచి కూచుని చూస్తున్నాడు. వెంటనే స్ఫురించింది. ఆ తురకవాడు యీ తిట్లు తిని వూరుకోడనీ, నన్ను చచ్చేట్లు తంతాడనీ. కాని నా నాలిక వుద్రుతాన్ని నా భయం ఆపలేక పోయింది. నేనింక తిట్టలేక అతని నిశ్చలత్వాన్ని చూసి ఆశ్చర్యపడి ఆగాను. అమీరట్లానే కూచున్నాడు. నేను కూచున్నాను. గాలికి మా గుడిసె ఆకులు గలగలమన్నాయి. ఆరిపోయే నిప్పులు గాలికిరేగి యెర్రగా మెరిశాయి. నక్క కూసింది. నక్షత్రమొకటి జారింది. నా ప్రక్కన యేడుపు గుక్క వినబడ్డది. అమీరేడుస్తున్నాడు. నా మనసు కరిగిపోయి, అతని దగ్గరికి వెళ్ళి అతని తలని నా కదుముకుని "దానిమీద నీకంత మనసా" అన్నాను. మళ్ళీ యేడ్చాడు. ఆ నిమిషాన అతనిమీద యెంత దయ కలిగింది? బలమైన మొగవాడి కఠిన హృదయాశ్రువులలో కరిగి చల్లారింది. నా కోపమంతా. ఆ రాత్రంతా అమీర్ని కావిలించుకుని పడుకుని, యేం చెయ్యాలో నిశ్చయించుకున్నాడు.

మర్నాడు మధ్యాహ్నం మీరా అమీర్‌తో మాట్లాడుతో వుండగా నేను యేరు దాటి జీడిమామిడి పొదలో కూచున్నాను. మీరా అలాగే తిరిగి వెళ్ళాలి. నా దిగులంతా పోయింది. అమీర్‌తో ఇదివరకంతా యిచ్చిన ఆనందం-అది నాకూ ఆనందమే. కాని, యిప్పుడు నాబాధని ఆనందంగా మార్చి అతని ఆనందంలో నేను ఆనందపడబోతున్నాను. గొప్ప సంతోషంతో నా వొళ్ళు పులకరించింది. ఆకులనీడలో వుడతలాడుకుంటున్నాయి. జముడుకాకి మూలుగుతోంది. ఆకుల్లోంచి ఎండ నా గోరుమీద పడి మెరుస్తోంది. మీరా వొస్తున్నాడు. అలా జుట్టు మొహంమీద పడుతో ఏమీ దిగులు నెరగని, కల్మషమెరుగని చూపుతో, ఆకాశాన్నీ, చెట్లనీ, చూసుకుంటో వెళ్ళే అతన్ని చూస్తే ఎంతో ముద్దొచ్చింది. పిలిచి, పక్కనకూచో పెట్టుకుని, ఆడుకోవాలని పించింది. కాని కిక్కురుమనకుండా కూచున్నాను. దూరానికి పోనిచ్చి వెనకబయలుదేరాను. ఊరుదాపుకు వచ్చేవరుకు అతను నన్ను చూడలేదు. అక్కడ ఎందుకో వెనక్కి తిరిగాడు. ఆశ్చర్యంతో నా కోసం ఆగాడు.

"ఏమిటిది?"

"పద"

"ఎక్కడికి!"

"నా సంగతెందుకు? నువ్వు వెళ్ళు"

"ఎందుకు వొస్తున్నావు?"

"నా యిష్టం"

పాపం. నా గొంతుమార్చి యిలా కఠినంగా మాట్లాడితే చాలా నొచ్చుకున్నాడు. చప్పున వెనక్కి తిరిగి మైదానం వేపు నడుస్తున్నాడు.

నేను వెనకనే వెళ్ళి అందుకుని "ఎక్కడికి" అన్నాను.

"నా సంగతెందుకు నువ్వెళ్ళు"

"ఎందుకు వెడుతున్నావు!"

"నా యిష్టం."

"మరి వూళ్ళోకి వెళ్ళవూ?"

"ఇది మా వూరు కాదు"

ఇద్దరమూ పకాలున నవ్వాము.

"రా మరి" అన్నాను గోముగా,

"ఎందుకో చెప్పు"

"దాని యింటికి"

అతని మొహంమీద భయమూ, కోపమూ, కమ్మాయి, తమార పుష్పంమీద దుమ్ము పడ్డట్టు.

"నీతో చెప్పినందుకు యిట్టా చేస్తావా?" చాలా కష్టంగా అన్నాడు.

"నేనేమీ చెయ్యను. నీకు గానీ, అమీర్‌కి గానీ ఏమీ అపకారం చెయ్యను."

"అయితే ఎందుకు"

"చెప్పుతాగా"

"ముందు చెప్పు"

"నన్ను నమ్మవూ? నా మాట నమ్మలేవూ?" అని గడ్డం పట్టుకు వూయించాను. కరిగిపోయినాడు. ఆలోచించాడు. వెనక్కిమళ్ళాడు. పాపం అనిపించింది. మీరాని అన్యాయం చేస్తున్నానా? నా పనికోసం నా స్వలాభం కోసం అతన్నీ, అతని రమ్య స్వభావాన్నీ నిర్భయంగా వుపయోగించు కుంటున్నానా? కాని ఆలోచించటానికి వ్యవధి లేదు.

ఆ వూళ్ళోకి వెళ్ళడం, మళ్ళా ప్రజల్ని చూడడం అదే మొదటిసారి. కాళ్ళు వొణికాయి. అందరూ నన్ను చూసి నవ్వుతున్నట్టే వుంది నా మనసుకి. కుమ్మరి యిల్లుదాటి, కోమటి అంగడి ముందునుంచి, మొరిగే కుక్కల్ని తప్పించుకుంటో వెళ్ళాను.

వూళ్ళే, ప్రజలే, రోడ్లే కొత్తగా వున్నాయి నాకు.

ఆమె అందమయింది. అందం కంటె గాంభీర్యమెక్కువ, భారీ. ఆమె ముందు నేను చిన్నపిల్లలా గున్నాను. ఆ పెద్ద కళ్ళల్లో బలుపు బుగ్గల్లో రాజఠీవి వుంది. మాట్లాడాను. బతిమాలాను. ఆశ్చర్యపడ్డది. మొదట నన్ను నమ్మలేదు. నమ్మించాను. ఆమెకి అమీర్‌మీద ప్రేమలేదు గాని అభ్యంతరం లేనట్టు తెలుసుకున్నాను. తన మర్యాద కెక్కడ నష్టం వొస్తుందో ననేదే మొదటి భయం.... "బికారివాడు. వాడితో నాకెందుకు?" అని విసుక్కుంది.

"డబ్బు కావాలా?"

"అది కాదు. అట్లాడివాడితో- దరిద్రుడితో నాకు సావాసమని తెలిస్తే నలుగురు నవ్వుతారు. చులకనైపోతాను."

ముఖ్యంగా యిదివరకంతా నేను గోలచేస్తాననే భయపడ్డది. నేనే బతిమాలేప్పటికి ఆమె అభ్యంతరం చాలా వరకూ పోయింది.

మర్నాడు సంజ మసకలో అమీర్ని ఆమె యింటికి తీసుకెళ్ళాను. నేనూ ఆ గదిలోనే వొకమూల తల తిప్పేసుకు కూచున్నాను. తలుపులూ, కిటికీలు అన్నీ బిగించాము.

ఎంత ప్రయత్నించినా చెవులు మూసుకోలేకపోయినాను. మొదట బాధపడ్డాను. నా వశం కాకుండా యీర్ష్యాపడ్డాను. దాన్ని అమీర్ ముద్దు

చెయ్యడమూ, నన్ను పిలిచిన రహస్యపు మాటలు దాంతో పలకడమూ, అట్లాంటి కాంక్షతో బరువెక్కిన కంఠమే మళ్ళీ వినడమూ, నాకు మరణ బాధని కలిగించింది. కాని నాకు త్వరలోనే తెలిసిపోయింది ఆ వ్యవహారం అట్టేకాలం సాగదని. మొదట్లో మొత్తానికి మోహంతో అతనిని చూస్తో కూచుంది. అమీరంత రసికుడు కోరి దగ్గిరికి చేరితే, కరగని దాని హృదయం రాయా, లోహమా అని ఆశ్చర్యపడ్డాను. అది నన్ను తృణీకరించినట్టే కోపమొచ్చింది నాకు.

ఇంటికి వెళ్ళేటప్పుడు అమీర్ ఆ సంగతే యెత్తలేదు. నేను చేసిన త్యాగానికి ఒక్కరవ్వ కృతజ్ఞతా చూపలేదే అని నాకు చాలాబాధ కలిగింది. మీరా మాత్రం మర్నాడు పొద్దున్నే వొచ్చి, నా చేతులు పట్టుకుని,

"ఎంత గొప్పదానివి!" అని కళ్ళ కద్దుకున్నాడు.

అట్లా పదిరోజులు గడిచింది. దాని యింటినించి యిద్దరమూ ఒకరి పక్కన ఒకరం చీకట్లో నడుస్తో వూరివీధులకీ, దీపాలకీ దూరమౌతూ తుమ్మల్లోంచి మెల్లిగా ఒక్కమాట లేకుండా నడిచి వొచ్చేవాళ్ళం. ఊరు దాటగానే, తాత్కాలికంగా అతను లోకంలో యితరులతో కలిసినా; ఆ మైదానంలో, వొంటరితనంలో అమీరిప్పటికీ నావాడేనని ధైర్యం కలిగేది. ఒకరోజు యింటికి చేరగానే అమీర్ నా మీద యెంతో ప్రేమా, కృతజ్ఞతా చూపాడు. అప్పుడు నాకెట్లా అనిపించిందంటే-అతన్ని చూడగానే యెట్లా అయిపోయిందంటే నా మనసు 'అతని కోసం, అతని సంతుష్టి కోసం ఏం చెయ్యగలను. ఇంకా ఏం చెయ్యగలను? ఏ త్యాగం నా వల్లనౌతుంది? ఏ స్త్రీలని అతనికోసం తీసుకురాగలను? నా ప్రాణాన్ని, మానాన్ని దేన్ని అర్పించను? నే నెటువంటి బాధలుపడి అతనికి ఆనందం కలిగించను?'' అని ఊరికే తపన పడేదాన్ని. నా హృదయంలో మండే ప్రేమాధికారాన్నీ యెట్లాగో అతనికి అర్థమయ్యేట్టు చెయ్యాలనిపించేది. వూరికే కావలింతల వల్ల వ్యక్తమౌతుందా ప్రేమ? అంతా సర్వమూ త్యాగంచేసి యేమీ అతనినించి నేను అనేది లేకుండా నా ఆహాన్ని చంపుకుంటేనే గాని?

నేననుకున్నట్టే పన్నెండోరోజు సాయంత్రం నేను అతన్ని ఆమె దగ్గిరికి రమ్మంటే,

"రాను....ఛూ....ధాం...." అన్నాడు.

ఆలోచించాను-అమీర్ దాన్ని యెట్లాకోరాడా? యింత స్వల్పంలో విసుక్కునేవాడు అంత తీవ్రమైన బాధ యెందుకు పడ్డాడా అని. మొగవాళ్ళు యెంత యెదిగినా పసిపిల్లలే యీ విషయంలో అనిపించింది. వాళ్ళకి కలిగిన బాధ యేమిటో, యెందుకో, వాళ్ళ వాంఛల కర్థమేమిటో తెలుసుకోలేరు. వారిని ప్రేమించే స్త్రీలు వారి తల్లులై వారి నర్థం చేసుకోవాలి. మొగవాళ్ళకి అట్లాంటి మార్పులు సహజంగా కావాలనిపిస్తాయి గావును- స్త్రీ నెంత ప్రేమించినా, ప్రేమ యెక్కువైన కొద్దీ దాన్ని భరించలేక.... అనుకున్నాను. కొందరు స్త్రీలు మొదట్లో నావలె మూఢులై తమపైని మొగవారి మనసు పోయిందని యేడుస్తారు. అమీర్ హృదయం నాదైనప్పుడు అతనెందరు స్త్రీలతో వుంటే నాకేం? అతని కానందం కలిగిస్తున్నాననే ఆనందం కన్న వున్నతమైన దేమున్నది నాకు? అమీర్ నా కంత సౌఖ్యమిచ్చాడే నేనీ చిన్న సౌఖ్యాలతనికి సమకూర్చలేనా?

తరవాత నాలుగు రోజులకి ఒకరాత్రి చీకట్లో పడుకుని అమీర్ తన మోచేతి వీద ఆనుకుని నా మొహం వెతుక్కుంటున్నాడు. కొండల్లో నక్కలు కూస్తున్నాయి. మిణుగురులు యెగురుతున్నాయి. గడ్డిలో అప్పటిదాకా వెలిగిన కొండమంటలు చల్లారి చీకటి నెక్కువ చేశాయి. ఆ చీకట్లో నల్లని ఆకారం మావేపు నడిచి వొచ్చింది. అమీర్ చెయ్యి కింద నా భుజం వొణికింది.

"అమీర్".

ఆ దూదేకుల మనిషి! తురక!

అమీర్ నన్ను చప్పున వొదిలి, లేచి కూచున్నాడు. నేను దూరంగా జరిగి చీరె కోసం వెతుక్కున్నాను. ఆమె వొచ్చి అమీర్ దగ్గిరగా కూచుంది. నేను లేచి యేటి దగ్గిరికి వెళ్ళి, నీటి వొడ్డునే యిసకలో కూచున్నాను. ఏటి ప్రవాహంలో చుక్కలు పువ్వుల్లా కొట్టుకొని పోతున్నాయి. ఇసికలోంచి యీడ్చుకుంటో పోయే గాలి చప్పుడూ, గులకరాళ్ళ మీద దొర్లే నీళ్ళ గలగలా వినబడుతున్నాయి. వొంటరిగా కూచున్న నన్ను రాత్రీ ఏరూ గుర్తుపట్టాయి. నా ముందరి పెద్ద ఆకాశం. విస్తీర్ణ మైదానం చీకట్లో ఆ మూల ప్రేమించుకునే వాళ్ళిద్దరూ-అంతా ఈశ్వరుడి సౌందర్యాన్ని నాకు దగ్గిరగా తీసుకొచ్చాయి.

నా హృదయం ఆనందంతో నిండింది. అమీర్ కోసం నేను ఆ నిమిషాన చేసిన త్యాగం పరమేశ్వరుడి కరుణని నామీద వర్షింప చేసిందేమో అన్నంత ఔచిత్యాన్ని కలిగించింది. నా కింకేం కావాలి లోకంలో! నా ప్రేమని, నా గతిని, నా ఆనందాన్ని తలుచుకున్నప్పుడల్లా నా హృదయం మండి అమీర్ని తలుచుకున్నప్పుడల్లా ద్వేషంతో వుడికి, బాధతో తపించాను. కాని ఎప్పుడు నా స్వంతసౌఖ్యాన్ని, స్వంత బాధ్యతని మరిచి అమీర్ ఆనందంతో నా జీవిత సమస్యల్ని ఐక్యం చేశానో, ఎప్పటి నించి నా జీవితోద్దేశ్యం అతని ఆనందానికి త్యాగమేనని నిశ్చయించుకున్నానో, ఆ నిముషాన్నించి ఆ కోపమే, ద్వేషమే అమృతంగా, మాధుర్యంగామారి నన్ను దివ్య ప్రేమానుభవంలో ఓలలా డించింది. ఆ యిద్దర్నీ అక్కడ, నాచోట, నా మైదానంలో నా భుజమానుకున్న చోటనే ఆమె భుజం. పెదవులు అతని పెదవుల మీద వొదిలి వొచ్చిన నా ప్రేమ రెక్కలు విచ్చి నన్ను నక్షత్ర మండలంలోకి తీసుకుపోయింది. మెల్లిగా నా దృష్టి, నా దృష్టి వెంట నా ఆత్మా, మైదానపు చీకట్లో ప్రసరించి, వ్యాపించి ఆక్రమించుకుని అంతా తానై కొండలమీదనుంచి కొండశిఖరాన మెరిసే నక్షత్ర కాంతిలో లీనమయింది. అమీర్నేకాదు- అమీర్ని, అతని ఔన్నత్యాన్నీ ప్రేమించి అతనికోసం విరహపడి ఆ అర్థరాత్రి వొచ్చిన ఔన్నత్యాన్నీ ప్రేమించి అతనికోసం విరహపడి ఆ అర్థరాత్రి వొచ్చిన ఆ తురకదానితో, దాని ప్రేమతో సానుభూతి కలిగింది, నా ఆత్మలో. నేనూ, యే స్వల్పత్వాన్నీ యెరగని ఆ రాత్రి సౌందర్యమూ వొకటేననిపించింది. నా వలనే ఆ నీలాంబరం, తనకింద కలుసుకునే ప్రియులకి చల్లని ఆనందాన్ని కల్పిస్తోంది. అమీర్నించి నా ప్రేమత్యాగపు వక్షాలమీద విస్తీర్ణమై, లోకాన్నంతా అవరించింది. మన బాధతో యింకొకరికి ఆనందాన్ని కల్పించామనే జ్ఞానంకాన్న గొప్ప ఆనందం లోకంలో లేదు అనిపించింది.

నా ఆత్మనంతా ఆ విస్తీర్ణపు అంధకారంలో కలిపి నన్ను నేనే మరిచి కూచున్న నన్ను, వెనకనే రెండు చేతులు కావలించుకున్నాయి. నా జుట్టులోంచి వొచ్చి నా మెదని రెండు పెదవులు ముద్దుపెట్టుకున్నాయి.

"ఎందుకు వొచ్చేశావు, నన్ను దాంతో వొదిలి?"

"పాపం. నీమీద యెంత యిష్టం లేకపోతే, బంధువుల్నీ, మర్యాదనీ, యీ అర్థరాత్రి తన యింటినీ వొదిలి వొస్తుంది?"

"నా కక్కర్లేదది."

"దానికోసం నువ్వుపడ్డ బాధ జ్ఞాపకం లేదూ?"

"అయితే-"

"దానికిప్పుడల్లా వుండదూ? మూలనున్నదాన్ని లాక్కొచ్చి, మనసు లాగి నువ్విప్పుడు వొదిలేస్తే-"

కొంచెం వూరుకున్నాడు.

"నువ్వు రోషపడక, దానివేపు మాట్లాడటం నాకు బావుండలేదు. కోపంతో తగూలాడితే, నిన్ను ఓదార్చాలనిపిస్తోంది....ఈసారి వొస్తే దాన్ని తన్నేస్తాను. దానికి సిగ్గూ, గిగ్గూ యేమీలేదు."

మొగవాళ్ళ హృదయం యెంతలో కఠినమౌతుందో, కాని స్త్రీలట్లా అమీర్ని ప్రేమించడం నాకు చాలా సహజంగా కనపడ్డది. ఒకవేళ నామీద ప్రేమ పోయినా, నన్నూ అమీరిట్లానే అంటాడా అని భయమేసింది. జాలీ ప్రేమా యెంత దగ్గిరిగా వుంటాయి! ప్రేమ పోయిం తర్వాత, పోనీ జాలికూడా చూపరు.

"అమీర్, నీ కెందుకు ఆమెమీద అంత అసహ్యం కలిగింది?"

"ఏం చేస్తుందంటే! నన్నంతా నలిపేస్తుంది. నాకు వూపిరాడనీదు. నా కాలు...."

నాకు నవ్వొచ్చింది. సిగ్గుపడుతో "నన్ను నువ్వు? అమీర్?" అన్నాను.

"కాని ఆడది...."

ఆ చీకట్లో యేడుస్తో నన్ను తిడుతూ,బెదిరిస్తో వొచ్చింది ఆ మనిషి తనూ మంచిదే. అమీర్ మంచివాడే. నేను చెడ్డదానినైనాను.

పాపం, ఒకత్తా, వొచ్చిన దోవనే తిడుతూ వెళ్ళేదాన్ని చూసి చాలా జాలేసింది నాకు ఏం చెయ్యను పాపం!

# 5

**ఆనాడు** శరద్రాత్రి. అమీర్ వేళ్ళు నా మెడమీద శ్రుతులును నొక్కుతున్నాయి. నా జుట్టు గాలిలో అతని మొహంమీద ఆడుకుంటోంది. ఇద్దరమూ ఆ వెన్నెల ప్రపంచంలో నీడలేని ఆ కొండమీద భూసౌందర్య మీక్షింప వచ్చిన దేవతలవలె నుంచున్నాము. కిందికి కళ్ళు తిప్పితే మా చిన్ని గుడిశా, నదీ, పటాలలోని బొమ్మలవలె కనిపించాయి. ఆనందంతో నా మనసు పరవశత్వం చెందింది. వరుసగా తరుముకుంటూ పావురాల్లాగు తెల్లనియీకెలమబ్బులు యెగుర్తున్నాయి. మా వెనక ఆ పాత కోట వుంది. తిరిగిచూసి, దాంటో మా సైన్యమూ, మంత్రులూ పరిజనమూ నిద్రపోతున్నట్లు మేము మాత్రం అర్ధరాత్రి లేచి బైట నుంచుని మా వెన్నెల రాజ్యాన్ని పరీక్ష చేస్తున్నట్టూ; అప్పుడే లోపలికి పోయి హంసతూలికా పాన్పుపైన విశ్రమింప బోయేట్టూ అనుకుని ఆ సంగతులు అమీర్తో చెపుతున్నాను. ఇద్దరమూ తురకంలో మాట్లాడుతున్నాము.

నా తురకం యేడిసినట్టే వుంది. కాని అమీర్ తురకం మాత్రం అద్భుతంగా వుంది. అట్లాంటి దర్జా రాజభాషకి తురకమే తగును.

“సార్వభౌమా! భుజబలంతో జయించి, శత్రువుల దునుమాడి, బీడుపరిచిన యీ మహారాజ్యాన్ని అర్ధరాత్రి నా కన్నుల పండువుగా ఒక్కసారి వీక్షింపనియ్యండి. కాని ఆ యేటి పక్కనున్న చిన్న కుటీర వాసుల్ని, ఆ నిర్భాగ్యుల్ని నా ప్రార్థనను మన్నించి ప్రాణాలతో వొదిలినందుకు సమస్త రాజమస్తక విరాజిత మకుటమణిమయ కాంతితేజములైన మీ పాదాలకు నమస్కరిస్తూ యున్నాను. ఆ క్షుద్ర కుటీరమున నున్న ఆ దంపతులెవరో మీరెరుగుదురా?”

“ఆ, మన అమాత్యవరుడు చెప్పగా వింటిని. ఆ పురుషుడు మర్యాదయు, నీతియులేక కులాంగనల చెరుపుటయే వ్రతముగా గల తుర్ష్కాధముడట.”

“ఆ స్త్రీ....”

“అది సిగ్గును, అభిమానమును త్యజించిన కులట....వారిని శిక్షింపక వదలగలనా?”

"మహారాజా! దుర్గంధమున నివసించు పురుగలవలె వారిని ఆ పాపమున బ్రతుకనిచ్చుటే మహాశిక్ష."

"రాజ్ఞీ! వారితో నేమి! తలచుకొనుటకైన తగని ఆ తుచ్ఛుల ప్రస్తావన మానుము...."

"నీ ముఖ సౌందర్యాన్ని కోరి, చంద్రుడు మేఘముల మాటున దాగుకొన్నాడు. నీ ముద్దు పెదవులు తాకి, ఆ పరిమళము వల్ల యిదేదో కొత్త పుష్పమను భ్రాంతితో ఆనిలుడట్టే నీ చుట్టూనూ మూగుచున్నాడు. నీ చుట్టూనూ వెన్నెల కొంచె మెర్రకాంతిని పొందుటచేత సూర్యోదయ మయిందా అని కోవెల మేల్కొనది. నీవీ ప్రపంచము నిట్లు క్షోభపెట్టుట న్యాయముకాదు. నీవు లేక చిన్నపోయి విచారగ్రస్తమైన శయ్యాగృహాన్ని నీ నేత్ర కాంతులతో వెలిగించుము."

"మీ నేత్ర ప్రతాపాగ్నిని చూచి భయపడి సర్వ ప్రపంచమునూ నిశ్శబ్ద మయినది. చిరకాలము మేఘముల వెనక దాగుకున్న చంద్రుడు సోమరి అని, మీరాగ్రహించెదరని బయటకు పరుగెత్తి మీ కళ్ళవంక భయంతో వీక్షించుచున్నాడు. మీ భారమును మోయలేక మన పాదముల కింద ఈ నగాధిపతి వణుకుచున్నాడు. మీ సౌందర్య మహిమను ప్రేమించి మ్లేచ్ఛాధముని కుటీరంబున బంధింపబడ్డ యింతి విరహతాపమున యేడ్చుకన్నీళ్ళే ఆ యేరు. ఆమె నిట్టూర్పు.....

అమీర్ కొట్టవచ్చాడు. నేను పరుగెత్తాను. తొరలోనే అలిసిపోయి ఆగాను.ఎందుకో అమీరు నన్ను అందుకోవడమంటే భయమేసింది.

కొండ అంచున నుంచుని "యింక వొస్తే దూకేస్తాను" అన్నాను.

"దూకు చూస్తాను" అంటూ వొస్తో వున్నాడు.నాకు నిజంగా దూకెయ్యా లనిపించింది. దూకి అతని కళ్ళల్లో బాధని చూడాలని కోర్కె కాబోలు! అతనికి నామీద వ్యధ కలిగించి, మోహపు అంతుని కనుక్కోవాలనే ఆశ గావును. తప్పించుకో చూసే నన్ను పైకెత్తి మేకపిల్లని లాగు మోస్తో తీసుకొని వెళ్ళాడు, గట్టిపడ్డ అతని దండలమీద చేతులువేసి పట్టుకుని కిలకిలనవ్వుతూ యిటూ అటూ చంటిపిల్లవలె తన్నుకుంటున్నాను. అతనికి యెదురుదెబ్బ తగిలి 'అబ్బా' అంటే కొంచెం సంతోషం వేసింది. దెబ్బ బాధతో పళ్ళు బిగించి,

నన్నాడనీకుండా తన రొమ్ముకి నా ఎముకలు విరిగేటట్టు వొత్తుకుని, వెళ్ళి చదునుగావున్న రాతిమీద పడుకోబెట్టాడు.

'నీ మూలంగా నాకెంత దెబ్బ తగిలిందో చూడు' నేను పకపక నవ్వాను. ఎత్తయిన ఆ ప్రదేశంలోంచి లోయలోకి నా నవ్వు ప్రతిధ్వనించి మూడుసార్లు నవ్వులు దూర దూరంగా వినబడ్డాయి. అమీర్ రొమ్ముపైన తల పెట్టుకుని వెన్నెలలో నిండిన దక్షిణ దిక్కుకేసి చూస్తూ శాంతంగా పడుకున్నాను.

సంపూర్ణమైన సంతుష్టితో నా చెయ్యి గరుకైన అతని చంపల్ని రాస్తూ అతని మొహంమీద జుట్టును తాకుతోంది. చక్కగా, తెల్లగా. మా వొంటినిండా, కళ్ళనిండా, గాలినిండా వెన్నెల వుక్కిరిబిక్కిరయింది. కోట గోడలకింద దాక్కున్న చీకట్లు గంభీరంగా కనపడ్డాయి. ఆ కొండపైన నవసించి యీ వెన్నెల్ని అనేక శరత్కాలాలు అనుభవించిన రాణుల ఆత్మలు నా చుట్టూ మూగినట్టు అయింది. ఈ పర్వత రంగంమీద ఎందరు వెన్నెలలో కూడా కందగల లావణ్యంగల రాచ స్త్రీలు, ప్రియులకోసం విరహాలు పడ్డారో, ఎన్ని రహస్య సంకేతాల నేర్పరచుకున్నారో, వాళ్ళలో అదృష్టవంతులెందరు ప్రియుల్ని కలుసుకుని, శీఘ్రరహస్య గాఢాలింగనాన్ని అనుభవించారో, ఎన్ని భగ్నమైన హృదయాలో, వెన్నెలి వేడెక్కించే నిట్టూర్పులో, కన్నీళ్ళో, నవ్వులో - ఏమైనారు వాళ్ళందరూ! ఇక్కడే యీ కొండచుట్టూ వేళ్ళాడుతున్నారా? నేను అమీర్ కూడా అంతేనా, అట్లానే కాలంలో మాయమైపోతామా?

అమీర్ పెదిమెలు నా ముఖాన్ని గట్టిగా ఆఘ్రాణిస్తున్నాయి. తుఫాను మొదలని నాకర్థమవుతోంది. ఇంత శాంతంగా పాల సముద్రంలో తేలే పర్వత శిఖరాలమీద నిద్రపోతున్నట్టు వున్న ఆ మధురమైన శాంతాన్నెందుకు అతను కలవరపరచడం?

"ఇంత వెన్నెలలో నిన్ను చూడాలి.నీటి చిన్ని అలమీద వలె నాట్యమాడే వెన్నెల నీ జుట్టుమీద చిన్న చిన్న చిందులు తొక్కితే చూడాలి అలి నీ వక్షాల నీడలకింద నిద్రపోతాను" అని నన్ను ఒక్క నిముషంలో వివస్త్రను చేసి చూశాడు ఆనంద ముద్రిత నేత్రాలతో.

అమీర్ తెలుగుదేశంలో పుట్టి, నన్ను పట్టుకుని యీ యెడార్లలో పడివుండక, యే పారసీక దేశంలోనో పుట్టివుంటే మహాకవి అయ్యేవాడని నా ఉద్దేశ్యం.

"నల్లని గోదావరీ తరంగాలమీద చూశాను. మళ్ళీ నీ జుట్టుమీద చూస్తున్నాను,యీవెన్నెల చిందులు" అంటాడు.

జుట్టు నా మొహం మీదపడే వొంపుని చూసి "నల్లని సముద్ర తరంగాలు వంపు తిరిగి తెల్లని నదురుమీద పరుగెత్తుతొ మీద పడేందుకు వస్తున్నట్లు భయమేస్తుంది" అంటాడు. ఆ రాత్రి మాత్రం చిత్రకారుడై వుంటాడనిపిస్తోంది. నన్నట్లాచూసి పొట్టదగ్గర చెయ్యేసి 'ఇక్కడ యీ యెత్తేమిటి? యిట్లా సాగిందేం?" అన్నాడు.

ఇంకా నాకే నిశ్చయం లేందే, యెవరూ కనిపెట్టటం సాధ్యంకాక ముందే, కళారసజ్ఞుడు అందమైన వొంపులకీ కానివాటికి నూరోవంతు భేదమయినది తెలియగల అతని కళ్ళకి తెలిసింది.

వూరికే గుడ్డిగా ప్రేమించబడటం ఒక విషయం, ప్రేమిస్తున్నారని సంతోషంగా వుంటుంది. కాని అటువంటి రసజ్ఞుడు సౌందర్యారాధకుడు ప్రేమిస్తో యెందుకు ప్రేమిస్తున్నాడో, దేన్ని ప్రేమిస్తున్నాడో తెలుసుకుని ప్రేమించి ప్రేమని పొంది, అతను ప్రేమించగల సౌందర్యాన్ని కలిగి ఉన్నాననే జ్ఞానం గొప్ప గర్వాన్నిస్తుంది. అమీర్ చూపుల్ని నిలిపివేయగల నా శరీరంమీద నాకంత ప్రేమ!

"నా కోసం, నా కళ్ళని మెరిపించేందుకు నా చేతుల్ని లావణ్య వరాలతో నింపేందుకు మీ వాళ్ళు, మీ బ్రాహ్మలు తపస్సులుచేసి, దేవతల్ని మెప్పించి నిన్ను కన్నారు" అనేవాడు. ఆ అమీర్ నాఅందాన్ని తప్పుపట్టాడిప్పుడు కాని నాకది బాగానే వుంది. గంతులేసే నా మనసు అతన్ని కంఠంలోని బాధని వినదలచుకోలేదు.

"అమీర్ అది ఇంకా యెక్కువయేటట్టు వుంది. లోపల ఎవరో స్థలం కోసం వెతుక్కుంటున్నారు" అన్నాను.

ఎంతో సంతోషంగా అమీర్ నన్ను మీదపడి నలిపేస్తాడో చీల్చేస్తాడో అనే భయంతో చేతులడ్డంగా పెట్టి కళ్ళు మూసుకున్నాను. ప్రళయాన్నెదురు కోడానికి తయారౌతున్నాను. కాని అతను తలవంచుకుని ఆలోచిస్తో పెదవి కొరుకుతో నుంచున్నాడు.

'ఇంక రా యింటికి వెడదాం' అని నిరుత్సాహమైన గొంతుకతో నెమ్మదిగా అన్నాడు. నా మనసులో రాయిపడ్డది. వెన్నెల మాయమయింది. నా అమీర్ ముఖంలోని ఆ ఒక్క నిర్ణయం అయిన చూపుతోనూ, 'ఈ ఎత్తేమిటి?' అన్న ఆ ఒక్క మాటతోనూ నా జీవితాకాశం మీద నల్లని మేఘాలు కమ్మాయి.

"చూడు. ఆ పొట్ట దగ్గిర వ్యవహారం నాకేమీ బావుండలేదు. దాన్ని ఎట్లానన్నా వొదిలించుకో-"

"యేం చెయ్యను?"

"పోగొట్టుకో"

"నీ బిడ్డ అమీర్!"

"నా బిడ్డకాదు, దెయ్యం. బిడ్డవొద్దూ, మొద్దూ వద్దు చంపెయ్యి."

నేను మాట్లాడలేదు. ప్రేమకోసం అమీర్‌తో వచ్చేశాను. ఇక రెండో ఆలోచనలేదు. కాని యిప్పుడా పని చెయ్యడమంటే పెద్ద భయం మొదలు పెట్టింది. దేనినన్నా చంపడం, ఎవరి డబ్బన్నా దోచుకోడం, అన్యాయంగా సాక్ష్యం చెప్పి ఖైదుకు పంపడం-యీ పనులు చెయ్యవలసి వస్తే ఎట్లాంటి పాపభయం తోస్తుంది? అట్లా వుంది. ఈ పనితో దేవుళ్ళందరికీ నా మీద కోపం వస్తుందనీ, అమీర్‌ని నన్నూ ఎట్లానో శిక్షిస్తారని వొణుకు పట్టుకుంది. ఇప్పుడూ అట్లానే అనిపిస్తోంది. నిజంగా శిక్షించారేమో-

అదిగాక ఏదో ప్రేమకూడా అప్పుడే ఉదయించింది.దేనిమీదనో తెలియని దానిమీద. అమీర్ పడే అసహ్యంకూడా నా యీ భయాన్ని జయించ లేకపోయింది. తల్లి తన పిల్లలకైపడే రక్షణోద్రేకం నా కప్పుడే కలిగింది. అమీర్ హంతకుడైనట్లూ, నేను ఆ అనాథ శిశువుని రక్షించవలసినట్లూ, రక్షణకోసం అది నన్ను వేడుకొంటున్నట్టూ తోచిందిపుడు. ఏమైనా సరే నన్ను అమీరు ఒదిలివేసినా, నా బిడ్డని రక్షించుకోవాలని నిశ్చయించుకున్నాను. అతనెంత బతిమాలినా, నేను వొప్పుకోలేదు. నాకే అర్థంకాని, ఎన్నడూలేని మొండిపట్టు ఒకటి బయలుదేరింది నాలో. అతని మీది నా గొప్ప మోహాన్ని మింగివేయగల యింకోశక్తి నాలో పెరిగింది.

ఆ కోపంతో అమీరు అక్కడక్కడ తిరుగుతున్నాడు. నే ఒంటరిగా కొండమీద తేలే నీడల్ని చూస్తూ కూచునేదాన్ని. కాని అంత వొంటరి అనిపించేది కాదు అమీరు ఒకరోజు తాగివచ్చి నన్ను కొడ్తాడు. కాని తరవాత పశ్చాత్తాపంతో ఎంతో ప్రేమ చూపాడు. ఒకనాడొక దక్షిణాది చీర తీసుకొచ్చి నా కిచ్చాడు. నేను యిదేమిటా యితనికి యీ చీరలమీద శ్రద్ధ అనుకున్నాను.

"నాకు కనబడకుండా యిది కట్టుకో" అన్నాడు. నా మొహంమీద ఉమ్మేసినట్లయింది.

నా జీవితం యేం కావాలి? విచారం గట్టిగా పట్టుకుంది. అమీర్ నాలుగైదు రోజల నుంచి అసలే కనబడడంలేదు. నేను ఆ పనిని వొప్పుకుంటేనే కాని అతనితో యింక సఖ్యంలేదని తెలియజేశాడు. నన్నీ విధంగా ఒంటరిగా నమ్మించి, తీసుకొచ్చి, యెంత చెప్పినా నా భయాన్ని అర్థం చేసుకోక నన్ను యిట్లా వదిలివేసే అతని కఠినత్వానికి యెంతో కోపం వచ్చింది. యేడుపొచ్చింది. ఒకరోజు మధ్యాహ్నం పెద్ద పోట్లాటయింది.

ఆ ఆరునెలలూ తాను యెక్కడికో వెళ్ళిపోతానన్నాడు. వెళ్ళవద్దని నే నేడ్చాను. అయితే తన మాట వినమన్నాడు. వినకపోవడానికి కారణం చెప్పమంటాడు. చెప్పడం యెట్లానో నాకు తెలీదు. మొండికేసి మాట్లాడకుండా మూలకూచున్న నన్నుచూసి పళ్ళు కొరికి కర్ర తీసుకొని బాదాడు. నేను మాట్లాడలేదు. చప్పున పెద్దగా ఏడ్చాడు.

"దీని మూలాన్నే, యీ పాడు పిశాచం మూలానే నీకూ నాకు చెడిందని" న్నా డొక్కలో ఒక తన్ను తన్నాడు; ఎందుకో అతని మీద అంత కోపంలోనైనా అతని కాలుని ముద్దు పెట్టుకోవాలనిపించింది. అదుగో తృణీకారం కనబడుతోంది నీ ముఖంలో కాని అమీర్ని చూశావా?

కోపంలో కళ్ళు యెర్రగా రుద్రుడివలె మెరుస్తూ, ఆ పెద్ద చేతులు బిగించి-అట్లాంటివాడికి అంత ఆగ్రహం తెప్పించేటంత అదృష్టం ఎవరికి కలుగుతుంది? కోపం వచ్చింది. కాని అతనిపైన గౌరవం అధికమైంది. దృఢంగా కోపం తెప్పించుకుని నిస్సంశయంగా కొట్టగలిగిన వాళ్ళని చూస్తే ఉండదూ మరి....?

హత్య అయినా సరే. ఆత్మహత్య అయినా సరే చెయ్యమంటారు. తమ కోసమూ, నీ కోసమూ తాము చేస్తారు. యే చిన్న భయాలూ, సందేహాలూ, పాపాలూ, వాళ్ళనేమీ అంటవు. వాళ్ళకి అర్థంకావు. వాళ్ల ప్రేమ చూపినా, ద్వేషం చూపినా దేవతలే. ఆ దేవతలకి చేసినట్లే ఆత్మార్పణం చెయ్యాలి. దేహాన్నీ, ప్రాణాన్నీ, పిల్లల్ని అర్పించాలి, వాళ్ళ పాదపీఠాల వద్ద. ఈ చచ్చు మొగుళ్ళు అట్లాంటి త్యాగం అడిగేటంత సమర్థులు కారు. గయ్యాళిగంప భార్య రోడ్డుమీద పడి అరిస్తే నోరు మూసుకున్నాడు. మా వూరి కరణం. బళ్ళో కుర్రాడితో. తన కళ్ళముందు కాపరం చేస్తున్నా బయటికెక్కడ కొస్తుందోనని కనిపెట్టి కడుపులో దాచుకున్నాడు హెడ్మాష్టరు. నేనే ఇంకోడికోసం కన్నెత్తితేనా ఇక్కడే నరకడూ అమీర్? నన్నే యింకొకడు కన్నెత్తి చూస్తేనా? వాడి కళ్ళు పెరికి పాతిపెట్టడూ? పదిమంది వొచ్చి మీదపడ్డా, తనని నరికినా, నన్ను వాళ్ళకి వొదిలి పరిగెత్తుతాడా? విస్తరినిండా తుంపర్లు పడేట్లు తిడతారు-దొంగనతంగా బుగ్గలు మెలేస్తారు, అంతేకాని దిమ్మతిరిగేట్టు అమీర్ మల్లే కొట్టమను మన మొగాళ్ళని. అసలు వాళ్ళ చేతుల్లో సత్తువ ఏడుస్తేగదా! ప్రతిష్ట దేవతని పూజ చెయ్యడం తప్ప యింకేమీ చాతకాదు మన పురుషులకి.

ఆ రాత్రి పెద్దవాన, సాయంత్రం నించి యెడతెరిపిలేక కురుస్తోంది. దీపమన్నా లేని ఆ చిన్న గుడిసెలో యిద్దరమూ కూర్చున్నాము. ఏ నిమిషాన ఆ పైకప్పు ఎగిరిపోతుందో అనుకుంటున్నాను. జగమంతా జలమయ మయినట్టూ, మేమిద్దరమే ఆ చిన్న నావలో అనంతయాత్ర చేస్తున్నట్టు అనిపించింది. ఇంక తెల్లవారదు.తేలుతో యే లోకానికో, యే ఒడ్డునో చేరుకుంటాము అనుకున్నాను. ముందేదో అపాయం రాబోతుందనిపించింది. అప్పుడన్నా అమీర్ ఆ రాయివంటి మౌనాన్ని వదులుతాడా! ఎంత రాత్రి అయిందో తెలీదు. అప్పుడప్పుడూ యోచనలోనూ, కునికిపాట్లలోనూ తూగుతున్న నాకు రోజులో, వారాలో జరిగిపోయినట్టు తోచింది. ఇంత ఆ చిక్కని వూపిరాడని నిశ్శబ్దాన్ని భరించలేక పిలిచాను-జీర్ణమైన ఆ గుడిశని చలిగాలి, చినుకులతో సహా యీ మూల నించి ఆ మూలకి వూడ్చుకుంటూ పోతోంది.

"అమీర్!" మాటలేదు.

"అమీర్!", అంతే-

మెల్లిగా కదులుతో, చేతులతో, తడుముతో, వెళ్ళాను.

నా కాళ్ళు అతని కాళ్ళకు తగిలి ముందుకు తూలిపడ్డ చేతులమీద అనుకున్నాను. అతను కదలక అట్లాగే పడుకున్నాడు. కోపంతో మండి పోవడంలేదు గదా? నేను మోకాళ్ళ పక్కనే కూచున్నాను. అతని శ్వాసా, వానహోరు చప్పుడూ? ఆకాశం భగ్గుమని వెయ్యి కాగడాలతో వెలిగింది. ప్రళయం వొచ్చింది. మేమిద్దరం నాశనమనుకుని వొణికాను. పెళ పెళ ఆకాశం విరుచుకుపడుతూ వుంది.

"అమీర్! చచ్చాను" అని అతన్ని కావలించుకున్నాను.

"రాజా!" అని నన్ను గట్టిగా కావలించుకున్నాడు.

ఏటి ప్రవాహం మోగుతోంది. గాలి గుడిశ గడ్డిలో నుంచి దూసుకు పోయింది. మెరుపురానీ, ఉరుములు రానీ ప్రళయమే రానీ యింక భయం లేదు, ఆ రెండు చేతులూ నన్ను రక్షిస్తున్నంతసేపు.

"యెన్నాళ్ళకి! మళ్ళీ యెన్నాళ్ళకీ"

దగ్గిరిగా, యింకా దగ్గిరిగా జరిగి, వొత్తుకుని, అణిగి, అయిక్యమై పోయినాను.

మాట్లాడలేనంత ఆనందంలో మునిగిపోయినాను.

"అమీర్!" "అబ్బా భరించలేను." అంతే.

వాన మళ్ళీ యింకా నాలుగు రెట్లుగా ప్రారంభించింది.

అమీర్ 'నా మాట వినవా?' అన్నాడు. తన చేతులతో రొమ్ములో నన్ను అదుముతూ-

"ఈ మెత్తని శరీరంలో ఎక్కడ వుంది ఆ పట్టుదల, ఆ పెంకితనం?"

"పెంకితనం లేదు" అన్నాను.

'అవును.' పెంకితనం కాదనీ, నా శక్తికి మించిన ప్రోద్బలమనీ చెప్పాల నుకుంటాను. మాటలు తెలీవు. అమీరుకి తెలిసేట్టు యెట్లా చెప్పాలో తెలీదు.

మాట్లాడలేదు. కాని అతనినట్లా బతిమాలుకుంటే నా కోసం, మా ప్రేమకోసం, మా ఆనందం కోసం-

మాట్లాడలేను. నా కంఠం విచారంతో పట్టుకుపోయింది.

"నీకు నా మీద ప్రేమ వున్న దన్న మాట అంతా అబద్ధం. నీకోసం నన్ను చావమను. నా రక్తమంతా కార్చమను, నా తండ్రిని నరకమను వెనుతీస్తానా?"

ఉత్త ప్రగల్భాలు కావనీ, వెనుతీయడనీ నాకూ తెలుసు.

"ఇంతేనా? ఇంత క్రూరమైనదానివా? నా మీద అసహ్యం పుట్టి నన్ను వొదుల్చుకోడానికి చూస్తున్నావా?"

క్రూరమైన మాటలవి. కాని అమీర్ కంఠంలోని జాలి వాటికి భయంకరమైన లోతును కలిగిస్తూ వుంది-

"రాణీ! ఇంతేనా మనకి?"

రెండు వేడి కన్నీటి చుక్కలు పడ్డాయి. అవి అతని కళ్ళలోనించి రక్తపు చుక్కలయినట్టు భయపడ్డాను. అమీర్ కళ్ళలోంచి నీళ్ళా! నల్లరాతిలో నించి! యింక ఆగలేను. పోనీ సరేనంటా. యే త్యాగమైనా యింకా సంకోచింపగలనా?

మెల్లిగా గుండ్రంగా నా పక్క ఎముకల్ని-కాదు నా గుండెల్ని- నా ఆత్మని-తాకుతో తన చిన్న కాళ్ళతోనూ, పెదిమలతోనూ రాసుకుంటో కదిలింది. నా మొహం తిరిగింది. యేమనను? ఎట్లా? తన ప్రాణం కోసం, పాపం ఆ నోరులేని దిక్కుమాలిన ఆ చిన్నకూన తన ప్రాణం కోసం వేడుకొంటోంది?

అమీర్ బిడ్డ?

"నా చేతకాదు అమీర్?"

మొహంమీద ఉమ్మి పడ్డవాడివలె లేచాడు అమీర్. ఆకాశం మెరిసింది. అమీర్ ముఖాన నిప్పులు రాలుతున్నాయి. ఏం చేస్తాడో, యేమంటాడో అనుకుంటూ వున్నాను.

ఆ పెద్ద ఉరుము మధ్య పిడుగువలె అతని మాటలు నా చెవిమీద పడ్డాయి.

"నేను వెడుతున్నాను."

సీత నడివికి పంపించ నిశ్చయించుకున్న రాముణ్ని కన్నీళ్ళెంత మాత్రం కరిగించగలవో అమీర్‌నీ అంతేనని తెలుసు. ఇద్దరూ ధీరోదాత్తులు, కాని మాట్లాడకుండా యెట్లా వూరుకోను?

"యెక్కడికీ!"

"యెక్కడికైతేనేం! ఇంకా ఆర్నెల్లకి వొస్తాను."

"అమీర్ నువ్వు కనబడక ఒంటరిగా నేనిక్కడ...."

"నీకు బియ్యమూ అవీ మీరా యిస్తాడు."

ఇదే చివరిమాట. నేను యెంత గోలపెట్టినా, ఏడ్చినా. ఒక్కమాట మాట్లాడక ఒక్కసారి నా వేపు కన్నెత్తి చూడక వెళ్ళిపోయినాడు నా అమీర్. ఆ వానలో, ఆ చీకట్లో, ఆ అర్ధరాత్రి!

# 6

**అమీర్** ఒక్కరోజుకనబడకపోతే ఒక్కరోజయినా యెట్లా బతకనా అనుకునేదాన్ని, వెళ్ళింతరవాత నేననుకున్నంత ఒంటరిగా లేనేలేదు.

నన్ను అన్యాయం చేసి వొదిలాడే అనే రోషం, నా అభిమాన నష్టమే నన్ను బాధపెట్టాయి. అమీర్‌మీద కోపం కలిగింది. ఎట్లానన్నా అతను నా కోసమే పరితపించి బాధపడేటట్టు చెయ్యాలనిపించింది. ఇంక అతనికి కనపడకుండా వెళ్ళిపోతే. దేంటోనయినా పడి చచ్చిపోతే? మళ్ళీ వెళ్ళి అమ్మదగ్గిర చేరితే? ఇన్నీ అనుకున్నాను.

మీరా పదహారేళ్ళ కుఱ్ఱవాడు. చాలా నాజూకైనవాడు. తరతరాల నించి వొచ్చే గొప్ప వంశపు లక్షణాలు అతనిలో ఎక్కడ చూసినా, కనిపిస్తాయి ఆ వేళ్ళ యెఱ్ఱని చివర్లలో, ఆ కళ్ళ కొలుకుల తేటలో, ఆ చంపల పాల మెత్తదనపు నునుపులో, మాట్లాడేప్పటి వొంపు ధీరత్వంలో, చేతుల నెమ్మదీ, గంభీరమూ అయిన ఊపులో, మర్యాదలో, గౌరవంలో, ధీయుతమైన కాంక్షలో సహజంగా

పుట్టిన 'నొబిలిటీ' తోస్తుంది. వందల కొలది యేళ్ళనించీ నీచమైన తలంపులు లేనటువంటి వాళ్లూ, సౌందర్యాన్నే ఆరాధించి, దేహాన్నీ, ఆత్మనీ మెరుగుపెట్టి తేజస్సుతో నింపినవాళ్ళూ మీరాని కన్నట్టున్నారు. అట్లా సుందరమైన పటంలాగ, విగ్రహంవలె, ప్రపంచాత్మానందం కోసం ఉండి పోవలసిన వాడుగాని, సామాన్య మానవుల వలె పనికీ వ్యవహారానికీ ఉపయోగపడవలసినవాడుగా కనబడడు. నాలుగు రోజుల్లో నాకు వశుడైనాడు. భోజనానికీ, నిద్రకి ఇంటికి వెడతాడు. తక్కిన సమయాలలో యెప్పుడూ నా కెదురుగా మాటలు చెపుతో కూచుంటాడు. నేనేమి చేస్తున్నా, ఏమి మాట్లాడుతున్నా చెవులూ, కళ్ళూ వొప్పజెప్పి ఒక్కమాటెక్కడ మాయమౌతుందో, ఒక్క చూపెక్కడ జారిపోతుందో అన్నట్టుంటాడు. త్వరలో అమీర్ నాకు జ్ఞాపకం రావడమూ, నేను విచార పడడమూ తక్కువై పోయినాయి. నా కళ్ళవెంబడి నీళ్ళచుక్క చూశాడంటే మీరా గిలగిల లాడేవాడు. నా ఆలోచనలోకి కొంచెం విచారం తోచగానే నా ముఖాకాశం మీదికి మబ్బు వొచ్చిందని, తాను గాలిననీ, వీచి మబ్బుల్ని తరిమేస్తాననీ మాటలు చెప్పి నవ్విస్తాడు. నా వొళ్ళో పడుకుని వూరికే పాటలు పాడుతో యిటూ అటూ దొల్లుతాడు. నా కళ్ళలో పడే జుట్టుని పైకి తోస్తో, దాంతో 'సీరియస్'గా పోట్లాడతాడు. నా నవ్వును దాచుకుంటానని అల్లరి యత్నాలు చేస్తాడు. నా వేళ్ళు బొమ్మలైనట్టు గంటలకొలది ఆడుకుంటాడు. పది వేళ్ళకీ పది ముద్దు పేర్లు పెట్టాడు. వాటిని పిలుస్తాడు. మాటాడతాడు అతని అందమైన బుగ్గలు నిమురుతో, అతన్ని కావలించుకుంటో వుడికిస్తో, నేను కాలం గడిపేదాన్ని. అతని ఆటలూ, స్నేహితుల అల్లర్లూ, చిన్నపిల్లలమీద చిన్నప్పటి ప్రేమలూ, అన్నీ సంతోషంగా వినేదాన్ని. ఆ చేతులు కొంచెంగా వూయిస్తో రాజఠీవితో తల ఆడిస్తో మాట్లాడుతో వుంటే యీ నవాబు నా వొళ్లో •కెట్లా వొచ్చాడని పించేది. ఎక్కడనించో తెచ్చేవాడు, కూరలూ, ఫలహారాలూ పాలూ, పళ్ళూ, ఇంటిదగ్గిర పెట్టినవన్నీ దాచి నాకు పట్టుకొచ్చే వాడేమో? రోజూ సాయంత్రం పూలదండ చేతిలో లేనిది నాకు కనపడడు. నన్ను రాత్రి పడుకోబెట్టిగాని యింటికి పోడు. నాకు వొంటరిగా భయం వేస్తుందని యింటికి వెళ్ళడు, నే నెంత బతిమాలినా.

అయినప్పటికి వెన్నెలరాత్రులు నీటికి వెళ్ళినప్పుడు చందమామ యేటినీటిలో కనబడితే, అర్ధరాత్రి నక్క అరుపుకి మెలుకువ వొస్తే, అరుద్ర పడమట పెద్దగా అస్తమిస్తో వుంటే, అమీరులేని లోటు నన్నావరించి బాధ పెట్టేది. మీరా నన్నెంత వుత్సాహ పెట్ట ప్రయత్నించినా వ్యర్థమయేది.

"నిన్నంత బాధపెడుతున్నాడు. వాడు నీ శత్రువు" అంటాడు మీరా.

"నేను పెద్దవాణ్ణయితే నా కోసం యెవరన్నా యింత బాధపడతారా, నువ్వు అమీర్‌కోసం పడుతున్నట్టు?" అన్నాడొక రోజు.

ఒకసారి యాలక్కాయలన్నీ జేబులో పోసుకొస్తే వాళ్ళపిన్ని చూసి "అది నీ చేత దొంగతనాలు కూడా చేయించుకుంటోందా? ఉండు ఒకసారి నౌకరిని పంపి తిట్టిస్తానంది."

"ఆ మాట నాకు చెప్పడానికి అతను పడ్డ సిగ్గు - ! ఒకరోజు ఒక చిన్న బాకు తీసుకొచ్చి యిచ్చి అది తలకింద పెట్టుకుని పడుకోమన్నాడు. ఎందుకంత ప్రేమ అతనికి నాపైని అనిపించేది.

ఒకనాడు మేమిద్దరమూ యేరుదాటి జీడిమామిడి గుబురులో దూరి కూచున్నాము. గాలి వచ్చి రాలిన ఆకులన్నిటినీ యిటూ అటూ తోసి ఆడిస్తోంది. ఆకాశాన తెల్లని మబ్బులు వరుసగా లేచి బయలుదేరి పోతున్నాయి. మీరాకి కోపం తెప్పించడం చాలా సులభం.. అతని కోపం మొహంచూడడం నాకెంతో యిష్టం. ఆ తెల్లని చర్మంలోకి యెర్రని మెరుపువచ్చి గులాబి మొహమల్ వలె ప్రకాశిస్తుంది. మీరా తన వేళ్ళతో నా పెదిమల మీద మెల్లిగా తాకుతో పాడుతున్నాడు. నేను పరధ్యానంగా వేళ్ళని తీసేశాను. వెంటనే కోపంవచ్చి తల తిప్పేశాడు. అతన్నింకా వుడికించాలని దూరంగా జరిగాను. నా వంక చూశాడు. నేను పలకలేదు. బాగా వుడుక్కుని చప్పున లేచివొచ్చి యెదురుగా వుధ్రుతంగా నన్ను కావలించుకొన్నాడు. అతని మొహం బాగా యెర్రనయింది. శ్వాస నా మొహాన తుఫానువలె కొడుతోంది. కళ్ళు తళ తళ మెరుస్తున్నాయి. నా భుజం మీద రవికెను పట్టుకున్న వేళ్లు వణుకుతున్నాయి. కొత్త ఆవేశం తెలుస్తో వుంది. తన నోటితో నా పెదిమల్ని వెతుకుతున్నాడు. చాలా మచ్చికగా వున్న పులిపిల్ల రక్తమాసించి తిరగబడి నట్లయింది. భయంతో, కోపంతో "యేమిటది మీరా?" అన్నాను. మెల్లిగా

పట్టు వొదిలింది. సాయంత్రపు పశ్చిమదిశవలె యెరుపుజారి మొహంలో సిగ్గు నలుపు కమ్మింది. చప్పున నన్ను వొదిలి పరుగెత్తి వెళ్ళిపోయినాడు. ఇంక రాడేమోనని భయమేసింది నాకు. కాని సాయంత్రం మెల్లగా తలవంచుకుని వచ్చి వొంగి నా కాళ్ళు పట్టుకున్నాడు.

"ఇంకెప్పుడూ చెయ్యను."

లెవనెత్తి గట్టిగా కావలించుకున్నాను.

"నా కట్లా బాగుండదు. ఏం?" అన్నాను.

"మరి నన్ను ఎందుకు ముద్దు పెట్టుకున్నావు?"

నా తప్పు తెలిసింది.

"మీ అక్క ముద్దు పెట్టుకోదూ. పోనీ మానేస్తాలే."

"వొద్దు, మానెయ్యవొద్దు. నాకు కోపం తెప్పించకుమరి" అన్నాడు.

అమీర్లేని సంగతి వూళ్ళో తెలీడం కొంత కాలం పట్టింది.

అతనికి పట్టిన అదృష్టాన్ని చూసి యీర్ష్యపడి నావంక కన్ను వేసి వుంచినవారు లేకపోలేదనీ మీరా పుచ్చుకున్న ముందు జాగ్రత్త వృథా కాదనీ. నా కొకనాటి రాత్రి స్వప్నమయింది. నిద్రపోతున్న నాకు ఎవరో దగ్గిరగా నడుస్తున్నట్లు తోచి మెలుకువ వొచ్చింది. చీకట్లో యింకా నల్లగా కనబడ్డది.

"ఎవరు?" అన్నాను భయంతో.

"నువ్వెవరే?"

"ఇదే మా యిల్లు. నువ్వెందుకొచ్చావు."

"దారితప్పి-"

కంఠమే చెపుతోంది అబద్ధమని.

"వూరు అటు"

"నాకు తెలీదు. కొత్తవాణ్ణి. ఈ రాత్రి ఇక్కడ పడుకుంటాను."

"వీల్లేదు."

"నేను కదలలేను."

దగ్గిరగావచ్చి కూచున్నాడు.

"నువొక్కత్తెవేనా?"

"వెళ్ళమంటే; నీకు కాదూ చెప్పేది?"

"వొక్కత్తెకూ భయంలేదూ? ఏం తోస్తుంది? నేను సహాయం వుంటానంటే సంతోషించక, పొమ్మంటావేం?"

"నాకేం సహాయ మక్కర్లేదు."

"నీకు సహాయ మక్కర లేకపోతే నాక్కావాలి?"

చప్పున నా మీదికి వచ్చాడు కంఠానికి గురిచూపిన బాకు భుజంలో గుచ్చుకుంది. కేకేసి బూతులు తిట్టుకుంటూ పోయినాడు. మర్నాటినించి మీరా ఎవత్తెనో మొగాడాంతదాన్ని నాకు సహాయం పడుకోబెట్టాడు కొన్నాళ్లు.

ఆ రాత్రి దీపావళి వెళ్ళిన పౌర్ణమి. యాడాదిక్రింద ఆ రాత్రి అమీర్‌తో నేను గడిపిన గడియలు ఆ చిన్న చలితోనూ, ఆ కొండలమీద వెలుగుతోనూ, అవ్యక్తమైన పరిమళంతోనూ, జ్ఞాపకం వొస్తున్నాయి. వ్యర్థంగా శూన్యంగా నేను గడుపుతున్న కాలపు దుర్భలత్వం మనసుకి గాఢంగా తడుతోంది. మీరా నా వొళ్ళోపడుకుని మాట్లాడుతున్నాడుగాని అతని మాటల ధోరణి మధ్య మధ్య మరిచిపోయి పరధ్యానంగా వూఁ కొడుతున్నాను-

"నువ్వు వినటం లేదు"

"కానీ...."

"వినటం లేదు. ఏమాలోచిస్తున్నావు?"

ఇట్లాంటి వెన్నెలలో అమీర్ ఒక నిమిషం యిట్లా తీరుబడిగా తోచకుండా కూచోనిచ్చేవాడా?"

"మాట్లాడవేం"

"అబ్బా మధురమైన అమీరు ఆలోచనలలో మునిగి కలలన్నా కననీకుండా యీ మీరా యేమిటి గోల!'

మీరా నాకెంతో ప్రేమాస్పదుడైనా, అమీర్ ధ్యాస తిరగ బెట్టిందా యింక నా మనసంతా అతని ఆయత్తమై ప్రపంచాన్నే మరిపిస్తుంది.

"వుండు మీరా."

ఆనాడు అమీర్ కొండకింద ప్రవహించే యేట్లోకి నన్ను తోస్తానని బెదిరించాడు. నేనతని మెడ పట్టుకుని వేళ్ళాడ్డమూ, నన్ను కావులించుకుని "అమ్మా! నాదాన్ని, ప్రాణాన్ని, నేను ఒకరవ్వ విడుస్తానా? అనడమూ; ఆ కొండ పెద్ద నల్లరాతి ముందు నన్ను నుంచోబెట్టి తను కొంచెం కిందికి దిగి నన్ను చూస్తో అక్కడనించే తన ఆనందాన్నీ ఆశ్చర్యాన్నీ వెలిబుచ్చడమూ; పిచ్చిపాటలు పాడుతో ఆ వెన్నెలనంతా చేర్చి బట్టని చేసి నాకు కట్టుకోడానికి కిస్తానని నవ్వడమూ; నిద్రపోతానంటే వెన్నెల వృధా అవుతుందని చంద్రుడు పచ్చగా పెద్దగా పడమట కుంకే వరకూ మాటిమాటికీ మూతపడే నా కళ్ళని బలవంతంగా తెరిచి చూపుతో వుండడమూ.

మీరా యేడీ? లేచి పిలిచాను.

ఇంటికి వెళ్ళాడా?

లేచి సగం వెతుకుతో సగం ఆలోచిస్తో తిరుగుతో వున్నాను. మీరా కూడా వెళ్ళిపోయినాడా నన్ను ఒంటరిదాన్ని జేసి యీ రాత్రి? ఏటివొడ్డున పడుకుని కనబడ్డాడు యిసికలో-"మీరా?" కదలలేదు. లేపాను. వూయించాను. ఏడుస్తున్నాడు.

మనసుకు తట్టింది?

"నీతో మాట్లాడలేదనా? అవునా? చెప్పు. నన్ను క్షమించు. నిజంగా చాలా దిగులుపడుతున్నాను. ఎప్పుడో ఒకప్పుడు అట్లా మరుపువొస్తే యింత అగ్రహిస్తావా! లేదు. ఏం! నిజం అట్లా అనుకుంటావా? కాదు. నిర్లక్ష్యంచేసి కాదు కాదు. కాదు"-

"యేమిటి? నువ్వు నాకు చవక కాలేదు. ఎన్నటికీ కావు....నాతో మాట్లాడవా!"

"పోనీలే అమ్మా అంత కోపమైతే"

నాకు విసుగూ రోషమూ వస్తున్నాయి. అమీర్‌లేని బాధ ఎక్కువవుతోంది. అంత అందమైన వెన్నెలకి బలిచేసి వెళ్ళిపోయిన నా నాధుడి క్రూరత్వం నన్ను కోస్తోంది. జీవితం దుర్భరం. జీవితం నిష్ఫలం. నాకింక ఆనందంలేదు. ఇంక ఆశలేదు-ఎందుకు బతికి? నన్ను వెక్కిరించినట్లు యీ సౌందర్యమంతా ఏమిటి!

"మీరా ఎందుకు నన్నిట్లా యేడిపిస్తావు?" మీరా లేదు.

వొంటరిగా ఆ యేటివొడ్డున కూచున్నాను. మా ప్రాణాలు, మా ప్రేమ, మా ఈతలు, మా సరసాలు అన్నీ ఆనందించిన యేరు నన్ను చూసి జాలిపడ్డట్టే వుంది ఆ యేరు. 'నదీ, నా తల్లీ ? నువ్వే నా దిక్కు' అన్నాను. ఏడుపొచ్చింది. నా మీద? నా జీవితంమీద నాకు చాలా జాలి కలిగింది.

ఈ నదిలోనే పడి మునిగిపోతాను, అమీరు వచ్చి యేడుస్తాడు. ఒంటరిగా యీ కొండలు, ఈ మైదానం, ఈ దుబ్బులుచూసి నన్ను పిలుస్తు పశ్చాత్తాపపడుతో యేడుస్తూ వెతుకుతాడు. అతని దుఃఖం తలుచుకుని వెక్కివెక్కి యేడుస్తున్నాను కాబోలు. మెల్లిగా మీరా వచ్చి నా చెంపల్ని తాకే దాకా నాకు తెలీదు.

"ఎందుకేడుస్తావు?"

అమీర్ కోసం అంటే మళ్ళీ వెళ్ళిపోతాడేమో.

"ఎందుకు వెళ్ళిపోయినావు?"

"నా మనసు మంచిదికాదు. దుష్టుణ్ణి. నా సంగతి పోనీ, నువ్వేమిటి యీ రాత్రి యోచిస్తున్నావు?"

"చెపితే నీకు కోపం వస్తుంది."

"అమీర్ని గురించేనా?"

"అవును"

"నాకు కోపమెందుకు? నాతో చెప్పు."

అమీర్ నన్నెందుకు వొదిలాడో మీరాకి తెలీదు.

కన్నీళ్ళతో, నిట్టూర్పులతో అంత సంగతీ మధ్యమధ్య సిగ్గుపడుతో చెప్పాను, నిదానంగా విన్నాడు. అమీర్ని తిట్టలేదు, నాకోసం జాలిపడలేదు. ఆ సంగతి మరిపించేసి నాతో ఆడుకుని నేను నిద్రపోయిం తర్వాత వెళ్ళి పోయినాడు. మర్నాడు ఒకత్తె వొచ్చింది.

"ఎన్ని నెల్లు అయింది?" దాని మాట నా కర్థం కాలేదు.

రాత్రంతా అమీరు కలలు కన్నాను. పగలంతా, అతను లేడనే విరహంతో మాడిపోతున్నాను. నా వికారంతో, డోకులతో, వొంటరి తనంతో,

విరహంతో, శూన్యభావంతో, నా మాతృభావం అడుగంటింది. నేను వెర్రిపట్టుపట్టి నా అమీర్ని వెళ్ళగొట్టానా? ఈ బిడ్డ పుడితే మాత్రం యెట్లా పెంచను? ఏం చేసుకోను? పోషణ యెట్లా? మా ఆనందానికీ, మా షికార్లకీ ఆటంకమనేకదా, అమీరు యీ కడుపు వొద్దన్నది అనుకున్నాను ఆ పిల్లకి పాలిచ్చుకుంటో, ఆ పిల్ల ఏడుపు సముదాయిస్తో, దాని మురికితోనిండి, ఆ ధ్యాసలోనే మునిగి....ఆ బిడ్డ మా ప్రేమని నాశనం చెయ్యదా? నా కంటె దూరదృష్టి కలవాడు అమీర్. అతనికి కోపం వచ్చిందంటే తప్పా మరి!

ఇప్పుడు నన్ను అమీర్ వొదిలి వెడితేనే దిక్కుమాలిన పక్షినైనానే. ఆ పిల్లతో సహా ఏనాడో నన్ను వొదిలేస్తే యిద్దరమూ యామైపోతాము? ఇప్పుడు బతుకు దుర్భరమైతే యే యేటిలోనో ముంచి అంతం చేసుకోగలను నా బాధని! అప్పుడో? అని అనుకుంటో వుండగా వొచ్చిందా మనిషి.

"నెల లేమిటి?"

"మీరాగారి అక్కగారు నన్ను పంపించారు."

"ఎందుకు?"

తెలిసింది. వొప్పుకోనా?

కాని నా చిన్నపాపని. నన్ను నమ్ముకుని నాలో దాక్కున్న పాపని....కాని మళ్ళీ అమీర్ రావడమూ, నేనూ అతనూ ఆ మైదానంలో పూర్వం మల్లేనే...'సరే' అన్నాను.

ఒక్కమాటలో, ఒక్క తలవూపుతో యీ దుస్వప్నం చెదిరి పోతుంది. మళ్ళీ మెలకువ వచ్చేటప్పటికి, మళ్ళీ అమీర్ నా ప్రక్కన వుంటాడు. మళ్ళీ జీవితమంతా ఆనందమయ మవుతుంది. ఈ పిల్ల లేక పోతేనేం-కాలమంతా గంతులేస్తే, నా ముందు నవ్వుతో పరుగెత్తుతో వుంటే! ఎంత వెర్రివాళ్ళీ మనుషులు! ఆశపడి నవ్వుల్ని చేతుల్నిండా పోగుచేసుకుని అతి ఆశతో గుప్పెట్లు తెరిచి చూసుకుంటే, భరించలేని కన్నీళ్ళుగా మారి కనపడతాయి.

ఆ మూడు రోజులూ యమ బాధపడ్డాను. ఇంక మీరా నన్నింటి పెట్టుకొని నాకు పరిచర్య చేస్తో నాతో కలిసి పడ్డవేదన, ఋణం యెన్ని జన్మాలలో తీర్చుకోగలను? నానించి యేమాత్రం ప్రత్యుపకారమూ వొస్తుందనే ఆశైనా లేక నాకు చూపిన అట్లాంటి ప్రేమని పొందిన నా జీవితాన్ని తలుచుకుంటే నా వొళ్ళు పొంగిపోతుంది. నన్ను తాకుతో, నా జుట్టు దువ్వుతో, నా నోట్లో జావ పోస్తో, 'తగ్గిందా?' అని ప్రతి నిమిషం అడుగుతో, నా కళ్ళలోకి

చూస్తో, నా చీర సర్దుతో నా పక్కన కూచుంటే, నిజంగా యింకా నాలుగు రోజులు బాధలో పడుకోవాలనిపించింది.

ఆదుర్దాతో వెలవెలబోయే అతని మొహం చూస్తోంటే నా బాధ మరచి అతని బాధకై బాధపడేదాన్ని. నేనొక్క పెద్ద మూలుగు మూలిగి నప్పుడల్లా అతను విలవిలలాడి హడలిపోయేవాడు. అతని కళ్ళలోని వ్యధని చూడలేక ఆ నెప్పినంతా కుక్కుకుని కళ్ళు మూసుకు పడుకుంటే మళ్ళీ మళ్ళీ పలకరిస్తాడు. నేనెటు తిరిగితే అటు వొచ్చి కూచుంటాడు. నేను నిద్రపోతూంటే పాదాల దగ్గిర తల పెట్టుకుని పడుకుని నేను కదలినప్పుడల్లా చప్పున లేచి కూచుంటాడు. నా మీరాని, ఉరి తీస్తారుట అతన్ని. యామవుతుందో అతని అందం, అతని హృదయం? యే గులాబి పువ్వులకి కొత్తరంగు, యే నక్షత్రానికి కొత్తమెరుపు, ఏ మబ్బులకి కొత్త నునుపు నిస్తుందో? ఏ దేవతల హృదయాలకి కొత్తజాలిని, ఏ గంధర్వుల బాహువులకి కొత్తరసన, ఏ కిన్నెరుల కంఠాలకి కొత్త పాట నిస్తుందో! మీరా! మీరా!

ఆ రాత్రి నేను పక్కమీదపడి మూలుగుతున్నాను. అంతసేపు నా పక్కమీద పడి కూచున్న మీరా కుండపట్టుకుని యేటి దగ్గరికి వెళ్ళాడు. మీరా తెచ్చిన లాంతరు గుడిసెలో వెలుగుతోంది. గుమ్మంలో నించి తూలుతో నల్లని గడ్డం మనిషి వొస్తున్నాడు. వాడే ఆనాటి రాత్రి గడ్డం వాడని నాకు వెంటనే తెలిసి ప్రాణా లెగిరిపోయాయి. వాడు తాగి వుండకపోతే నా స్థితి అర్థమై వెళ్ళేవాడేనేమో? మీరా కోసం పెద్ద కేక వేశాను. వాడు తొరగా వచ్చి నా చేతులదిమి మీదపడి అల్లరి చేస్తున్నాడు. వాడితో పెనగడానికైనా శక్తిలేదు. మూలిగాను. బతిమాలాను. యింకా రాడేం మీరా! వొచ్చినా మాత్రం యీ రాక్షసి యెదుట యేం చేయగలడనే ఆలోచన తోచనేలేదు. మీరాని ముందే, బైటవాణ్ణి బైటనే యామన్నాచేసి రాలేదు కద వీడు? నా మూలాన, నాకోసం, మీరా గతి యామైంది? ఆ తలుపుతో నా అవస్థని నేను మరిచిపోయి, అతనికోసం గోలపడ్డాను. నన్ను రక్షించుకునే ధ్యాసే రాలేదు. ఐనా యేం చెయ్యగలను. వాడు నన్నుకిందికి అదిమి మరీ అశక్తురాలిగా చేశాడు. కళ్ళు తిరిగి బలహీనంతో మూతలు పడ్డాయి. ఎంతసేపయిందో పెద్దకేకలు వినబడి, కళ్ళు తెరుచుకున్నాయి. మీరాని వాడు మెడ పట్టుకుని లాక్కెడుతున్నాడు.

రక్తంకనబడ్డది. మళ్ళీ తెలివితప్పి పడిపోయినాను. లేచేటప్పటి కంతా నిశ్శబ్దం. దీపం మాత్రం వెలుగుతోంది. మీరా లేని సంగతి మొహాన కొట్టినట్లు అయి నాకు దిమ్మ తిరిగింది. ఆ రాత్రి నేను పడ్డ బాధ యీ కోర్టువారు నన్ను ఉరి తీసేటప్పుడు కూడా పడను. అంతే కావాలి అనుకుంటున్నావు. అట్లాంటి బాధ, నా మీరా, నా ప్రాణదానం జేసి, నాకోసం బలిపడ్డ మీరా కోసం పడ్డతపన యెంత ప్రేమలోనించి వొచ్చి వుండాలి? అది ఆలోచించు, ఆ ప్రేమ చాలదూ?

నేను పెద్ద రక్తపు మడుగులో దొల్లుతున్నాను. దాహంతో నాలిక లోపలికి లాక్కుపోతోంది, లేచి నీళ్ళ చెంబందుకోలేను. మీరా! మీరా! నీవు యేడీ! యామైబోయినాడు? చప్పున నాకళ్ళముందు ఇందాక చూసిన దృశ్యం కనపడ్డది. ఆ రక్తం! వాడి చేతుల్లో కత్తి! వాడుపోనీ, తన దుర్మార్గం నెరవేర్చుకో డానికైనా వెనక్కి రాకపోవడం! ఏం జరిగింది! తలచుకున్న కొద్దీ భయమేసింది. ఎక్కడ యే నూతిలో పారేశాడో! ఇప్పుడేదో గోతిలో కత్తిపోటు తిని మూలుగుతున్నాడేమో. మధ్యాహ్నం నా మెడచుట్టూ చేతులేసుక్కూచున్న మీరా? అక్కడైనా, ఆ బాధలోనైనా నన్నే తలుచుకుంటూ వుంటాడు వీష్మోనో అని. నా కాళ్ళు చేతులు ఇటూఅటూ కొట్టుకున్నాను. ఏం చెయ్యను? తీసుకురాగలిగితే ఎవరన్నా పిలవగలిగితే! తమాషా. అమీర వస్తే బావుండును. అతన్ని పంపిద్దును అని తోచి, యేడుపొచ్చింది? ఇంకేం మీరా? వాళ్ళ అమ్మ యెంత యేడుస్తుంది? నన్నెంత తిడుతుంది? ఆమెకన్నా తెలియజేయ గలిగితే! లేవబోయినాను. కిందపడ్డాను మళ్ళీ !

గుడిశ తలుపులోంచి ఉత్తరాభాద్ర కనబడుతోంది. దాని వెనక నించి చంద్రవంక విచారంగా ఉదయిస్తోంది. ఆ యర్రని కాలయముడు ప్రాణులపై పంపిన మరణపాశం వలె కనబడ్డది. దానికి నా మీరా కనపడుతున్నాడు? యే గోతిలోనో రక్తంకారే మీరాని చూసి కాదుగదా ఆ అరుణ కాంతి.... నక్క కూస్తోంది....యే గోతిలోనో, మీరా శవాన్ని వెన్నెట్లో చూసి కాదు కదా? అయ్యో మీరా!ఆ యేరట్లా యేడుస్తుందేం, యీరాత్రి! దాంట్లో పారెయ్యలేదు కదా మీరాని చంపి! ఈ దాహం యెట్లా? లేవలేను. ఎందుకు లేవడం? యెవరికోసం, కాని యీ బాధ! యింకెవరొస్తారీవేపు మీరా పోయిన తర్వాత! యింతే! నేనింక చావవలసిందేనా? అంతే కావాలి....అమీరు వొచ్చి తన

క్రూరత్వం వల్ల యేం జరిగిందో తెలుసుకుని, పశ్చాత్తాపంతో మండిపోవాలి. కాని అతనికేం!( (ఇంకెవ్వరినో తెచ్చుకుంటాడు. యిప్పటికప్పుడే తెచ్చుకున్నాడేమో! .... యీ ఘోరానికంతా అతనే కారణం? అతని కోసం) నేనీ తీవ్రత్యాగం చేశాను. చాలా కోపం వచ్చింది. అట్లాంటి క్రూరుణ్నెట్లా ప్రేమించానా అనుకున్నాను. మీరా నన్నింకా ఆక్రమించుకున్నాడు. మీరా కోసం దేవుణ్ని ప్రార్థించాను. వాళ్ళ అల్లాను వేడుకొన్నాను.... 'మీ వాడిని, మీరాని రక్షించ'మని కాని అమీరుని రప్పించమని ఏడ్చినపుడు నా మొర నెవరు విన్నారు! పోనీ అమీరు రాకపోయినా సరే మీరాను రప్పిస్తే చాలునన్నాను. తన ప్రాణాన్ని నాకు అహుతి చేసిన ప్రణయధీరుడు నా మీరా? కాని పాపాత్మురాలిని. నా యేడుపు దేవుడు వింటాడా? యెట్లా తెల్లవారిందాకా యీ 'సస్పెన్సు'లో కాలం గడపటం! తెల్లవారితే మాత్రం! పోనీ చచ్చిపోకూడదా? దాహం యింక బతకలేను. దాహం, బలవంతంగా లేచి కూచున్నాను. బట్టలన్నీ రక్తంతో తడిసి వున్నాయి. ఆ రక్తం మధ్య చిన్ని నోరెరగని పిల్ల? చిన్న కళ్ళు మూసుకుని, చిన్న కాళ్ళు, పొట్ట - భరించలేక పోయినాను. కళ్ళు తిరిగి పడిపోయినాను గావును-మళ్ళీ మెళుకువ వొచ్చింది. భయమేసింది. ఆ గుడిశకి- ఆమైదానానికి పిల్లానేనూ! అదీ! అది కదిలితే! లేచి బైటికిపోతే! చంపినందుకు నా మీద కసి తీసుకుంటే ప్రేమా దిగులూ మాయమై, భయం పట్టుకుంది. భరింపలేని దాహం! అమ్మా! ఏం బాధ పడ్డానో! రాత్రి ప్రతినిమిషమూ చస్తాననుకున్నాను. ప్రతిచప్పుడికీ ఉలికిపడి వొణికాను. కాని చావను. నిద్రో! మూర్ఛో!

మృదు పాదపద్మాల చప్పుడు నా హృదయంమీద కొట్టి లేపింది వేగుచుక్కలో నించి వూడిపడ్డాడు. నామీరా. పీక్కుపోతున్న నాలికతో- "వొచ్చావా? నా మీరా? నువ్వేమైనావు చెప్పు" అన్నాను.

చెప్పక "నువ్వెట్లా వున్నావు?" అంటో నా రక్తాన్ని చూసి పెద్దకేకేశాడు.

"నిన్నేం చేశాడు."

"ఏం చెయ్యలేదు. అసలు మళ్ళీ రాలేదు."

"రాలేదు కదా! ఆ రక్తమేమిటి?"

సిగ్గుతో నేను మాట్లాడలేదు.

"తాగడానికి నీళ్ళియ్యి ముందు"

నాకు నీళ్ళిచ్చి, శుభ్రంచేసి పడుకోబెట్టాడు. నాకు వేరే చీర లేదు. దుప్పటి కప్పుకున్నాను.

"అదంతా యేం చేస్తావు?"

నా చిన్నిపాపని బట్టలో లుంగచుట్టాడు.

"పారేస్తా!"

"నువ్వా! నీచేత యీ పనికూడా చేయించుకుంటున్నానా నిర్భాగ్యురాల్ని!"

"మాట్లాడకు"

వెళ్ళివొచ్చాడు.

"ఎక్కడ పారేశావు?"

"ఇంక నీకు కనబడదు."

ఎందుకో ఆ పిల్ల దిక్కులేకుండా పారెయ్యడమంటేనే నాకు కష్టంగా వుంది.

"నువ్వేమైనావో చెప్పు. నీకే అపాయం వొచ్చిందో అని"

"నేను యేటినుంచి తిరిగివచ్చి వాణ్ని చూసి వెంటనే మీదపడ్డాను. మా వాళ్ళు వాడికి బాగా తెలుసు. నన్ను లాక్కెళ్ళి చెట్టుకు కట్టేసి పోయినాడు. మళ్ళీ నీ దగ్గరికి వచ్చి యేం చేస్తున్నాడో, నువ్వేమైనావో, నీ బలహీనంతో అని నా భయం. 'ఆమెని తాకావా నిన్ను చంపేదాకా నేను నిద్రపో'నని అన్నాను కాని కుర్రవాణ్ణి నా మాట లక్ష్యం చేస్తాడా? అని సందేహమేసింది. వాడు వెళ్ళిన నిమిషాన్నించి ఆ తాళ్ళు కొరుక్కుని యిప్పటికి వొదిలించుకున్నాను" అన్నాడు.

అతని నోరంతా రక్తమే! మెత్తని చేతులు నలిగిపోయినాయి తాళ్ళ బిగుసుతో. 'ఇంత వోర్చుకున్నావా బాబూ?' ఆ మాటలు చెప్పి నా చేతుల్లోకి తూలాడు. అట్లాగే వుత్తవొంటికి అతన్నదుముకున్నాను. ఇద్దరమూ నిద్రపోయినాము. మధ్యాహ్నం దాకా.

# 7

రమ్మని అమీర్‌కి మీరా కబురు పంపాడు. కాని అతను వొస్తాడంటే నాకు అర్థంకాని భయం పట్టుకుంది. రాకుండా వుంటేనే బావుంటుందేమో ననిపించింది. అతను రాగానే మీరాతో జరుగుతున్న యీ మధుర స్వప్నంలోంచి మెలుకువ వస్తుందని భయం.

ఇట్లా ప్రేమ మాగడమూ, ప్రేమలో సందేహాలు రావడమూ, ఒకేసారి యిద్దరిమీద ప్రేమ వున్నట్లు తోచడమూ, ఆ ప్రేమే చెరొకరిమీద చెరొక విదంగా, వేరు కారణాలవల్ల కలిగినట్టుండడమూ - ఇదంతా మీ వంటివారు వొప్పుకోరు. వొళ్ళు కొవ్వెక్కితే, అట్లానే వుంటుందిలే. పశుకామం, అంటారు. అట్లా ఇద్దరిమీద వుండడం అసంభవమని తమ నీతి శాసనాలతో సృష్టినే, ప్రపంచంలోని హృదయాల్నే పాలించి అదుపులో పెట్టాలని ప్రయత్నిస్తున్నట్టు రాస్తారు కొందరు పుస్తకాల్లో! మీని గాలి మాటలు. నావి రక్తపు అనుభవాలు.

వారం రోజుల కిందటే కదా అమీర్ని అంత గాఢంగా కోరాను? యీ బాధంతా అతను రావాలనేకదా అనుకున్నాను. కాని ఆ మూడురోజుల నరకమూ నాకు మీరాని అపరిమితంగా సన్నిహితుణ్ణి చేసింది. మీరా నా జీవిత వృక్షాన్నంతా పెనవేసుకున్నాడు. నేనుపడ్డ యమబాధంతా మీరా అనే మంత్రంతో ఆనందమయంగా కనబడుతోంది. మళ్ళీ జబ్బుగా పడుకుంటేనేమి అనుకున్నాను. మీరా నాకు చూపిన మహాప్రేమ ప్రవాహం అవసరం లేక సన్నగిల్లింది. మళ్ళీ ఆ తీవ్ర త్యాగం అవసరమై నా కోసం ప్రవహిస్తే అతని ప్రేమ ననుభవించా లనిపిస్తోంది. కాని అతని రుణం తీర్చుకోగలనా? ఏం చేస్తే తీరుతుంది?

ఒకనాటి రాత్రి మీరాని పిలిచి చెయ్యి పట్టుకుని పక్కన కూచో పెట్టుకున్నాను. 'మీరా నేను నీకు కావాలా?' అర్థంకాక నావంక చూశాడు.

'ఆవాళ మధ్యాహ్నం....? అర్థమయిందని నా చేతుల్లోని అతని వేళ్ళు నాకు చెప్పాయి.

అతని చంపల్లోని సిగ్గుని చూసి మురుస్తో.

'నీకు కావలిస్తే యీ రాత్రి అయినా సరే'

'నీ కవసరమా?''

"నా కిష్టమే." నాకు సిగ్గేస్తోంది.

'అదికాదు. నేను నీకు అవసరమా? అమీర్ మల్లె కావాలా!'

ఎంత ఔదార్యమో? ఎంత లోతైన నాజూకైన స్వభావమో! అతన్ని గట్టిగా పక్కకి అదుముకుని మొహాన్ని తిప్పుకుని ముద్దు పెట్టుకున్నాను. నేను వొదిలిన అతని వేళ్ళు నా జుట్టులోంచి కదలలేదు. "నీతో అబద్ధం చెప్పలేనోయ్. నేను అమీర్‌దాన్నే అనిపిస్తుంది. నాకిష్టముండదు. నేనేం గొప్పదాన్నీ, పతివ్రతనీ అని కాదు."

"అయితే యెందుకడిగావు?" ఆ ప్రశ్న నన్ను గుచ్చుకుంది, సిగ్గుతో.

"నిన్ను సంతోష పెడదామని, యెందుకంటే నేను అమీర్‌దాన్నైనా అతనిమీద కంటే నీపైనే నాకు ప్రేమ యెక్కువ."

మాటలు తప్పించి యేవో మాట్లాడి వెళ్ళిపోయినాడు. మీరా లాంటి వాణ్ణి మళ్ళీ చూస్తానా? తురకలని గుమ్మంలోనికి రానియ్యరు పవిత్రులైన మీరందరు.

"దీదీ అమీరు వస్తే?" అన్నాడు ఒకరోజు.

"ఏమిటి?"

"నాకు భయంగా వుంది."

"భయం?" నాకు తెలుసు కాని అడిగాను. ఆడదాన్ని.

"వొప్పుకోడేమో?"

"ఎందుకు మీరా?" అడిగాను కాని ఆప్రశ్న నన్నూ బాధిస్తోంది.

"మనమింత స్నేహంగా వుండడం"

"తప్పేముంది?"

"లేదు. కాని అతనేమనుకుంటాడో?"

"అంతమాత్రం విచక్షణ లేనివాడా?"

"విచక్షణ వుంటుందా? నాకు భయమేస్తోంది" అన్నాడు.

"భయపడకు నేనున్నానుగా...."

"ఎందుకు; నిన్నేమైనా చేస్తాడని భయమా? నేను కాపాడనా?"

అమీర్ నా మాట వినడా?

"నన్నా? నన్నేమి చెయ్యడు. నాకా భయమేమీలేదు. పోనీ నన్నేం చేసినా చేయ్యనీ. ఏం చేస్తేనేం? అది కాదు, నిన్ను" అంటున్నాడు మీరా.

"నన్నేమి చెయ్యడు?"

"నీకు తెలీదు."

"నాకంటే పెద్దవాడిమల్లే మాట్లాడుతున్నావే?"

"నాకు లోకం తెలీదనా? అమీరు సంగతి తెలీదనా! నాకంటె ఏం పెద్దదానివి నువ్వు? నీకేం తెలుసు?"

నిజమే. నేనతనికన్న యేమాత్రం పెద్దదాన్ని! ఆడదాన్ని గనక అట్లా మాట్లాడుతున్నావు కాని - అన్నాడు గదా "నీకు తెలీదు; అందులో తురకవాళ్ళ సంగతి నీకేం తెలుసు?" ఊరుకున్నాను, ఆలోచిస్తే అమీరు రక్తపు మాటలు జ్ఞాపకం వొస్తున్నాయి. మీరా కూడా ఆలోచిస్తో కూచుని అన్నాడు కదా-

"ఇదుగో, నా కంఠం నులమనీ, నీమీద చెయ్యి వేశాడా-అమీరు.... అందుకనే నిన్ను విడిచిపోను. నా మూలాన నిన్నేమన్నా చేస్తే-చేస్తే చంపేస్తాను. పొడిచేస్తాను గుండెల్లో"

నేను మాట్లాడలేదు. నా పులిపిల్ల కళ్ళలోని నిప్పుల్ని, చంపలమీద మంటల్ని చూస్తున్నాను. నా చిన్నబాబు తక్తుమీద నించి మాట్లాడుతున్నాడు. "మాట్లాడవేం? అప్పుడు నా మొహం చూడను పొమ్మంటావా దీదీ?"

ఏం చెప్పను?

"మాట్లాడవా?" అన్నాడు అనుమానంతో. నేను మాట్లాడలేదు. చప్పున లేచి గుమ్మంలోకి నడిచాడు.

"నేను రాను. అమీరు వచ్చిం తరువాత."

"నువ్వు రాకపోయ్యేట్టయితే, అమీర్ రానక్కరలేదు" అన్నాను.

"ఎందుకఖ్కర్లేదు! నువ్వఖ్కర్లేదన్నా తనూరుకుంటానా? అతనూరుకుంటాడా?" పోట్లాట పోయింది. నా చూపుల్లో చప్పున స్త్రీ జాతికి సహజ ఆయుధం ధరించాను. నీళ్ళు నిండాయి.

"మీరా, నన్ను వొదిలేస్తావా?"

"అమీర్‌కి కోపం వచ్చి నిన్నేమన్నా చేస్తే!"

"మీరా! ఆ ఆపద రానీ ఆలోచిద్దాము"

# 8

**అమీరు** వొచ్చినప్పుడు మీరా లేదు. రాగానే అతని కళ్ళు నా దేహాన్ని అక్రమించుకుని వెతికాయి. సిగ్గుతో మెల్లిగా పక్కగా నుంచున్నాను. నా నడుం పక్కగా చెయ్యేసి నా మొహంవంక చూసి "మునుపటి కంటె కూడ ఎంత బావున్నావో! నీ కళ్ళలో కొత్త కాంతి వెలుగుతోంది" అన్నాడు.

అవే అతని మొదటి మాటలు. నేను తనకోసం చేసిన త్యాగం సంగతి యెత్తి నన్ను మెచ్చుకుని లాలిస్తాడని పడుతున్న ఆశ భగ్నమై నన్ను బాధపెట్టింది. ఆ సంగతి సూచనగా ఒకటి రెండుసార్లు ఎత్తినా అతను వినదలు చుకోలేదు.

అమీరు లేని నాలుగు నెలలూ, అసలు కాలంలో లేకుండా పోయినట్టే వుంది. తలచుకున్నా నాకు ఆ కాలం జరిగినట్టే తోచదు. ఎప్పుడూ మేమిద్దరమూ అనాదినించి, సృష్టి పూర్వంనించి అట్లానే కలిసి వున్నామని పించింది. మేమిద్దరమూ లేకుండా యీ సృష్టి నిలుస్తుందనిగానీ ఆ కొండ గడ్డి అట్లా ఎత్తుగా పరిమళంగా ఎదుగుతుందని గాని వూహించలేను.

"మనం పోయింత తర్వాత యీ గుడిశలో ఎవరాన్న వుంటారో, పాడుబడి, నక్కలు కూచుంటాయో?" అని అమీరంటే....

"మనం లేకపోవడ మేమిటి?" అన్నాను.

పూర్వం మల్లేనే సంతోషంగా గడిపాము వారం రోజులు. కాని అర్ధరాత్రి అతన్ని అనుకుని ఆకాశపు నలుపు లోపలికి చూసేటప్పుడు, అతను మెల్లిగా చల్లని గాలిలో పాడుతూ కూచుండగా, వెనకనించి నేను అతని కళ్ళకేసి చూస్తే యెప్పుడో త్వరలోనే ఆ శాంతం విరిగి నా తల పగిలేట్లు బద్ధలై పడుతుందని భయం వేసింది. అంత సంతోషంలోనూ కూడా నా హృదయం "మీరా యేడీ రాడేం" అంటోంది. అమీర్ తానా నాలుగు నెలలూ యెక్కడ వున్నదీ, యేమి చేసిందీ చెప్పలేదు. నేనేం చేస్తున్నదీ అడగలేదు. గుచ్చిగుచ్చి అడుగుతాడని భయంగా వుంది. కాని అడగలేదని బాధగానూ వుంది.

వారం రోజులైన తరువాత గావును. బియ్యం కోసం అమీర్ వూళ్ళోకి వెళ్ళాడో లేదో, చెట్ల వెనక మళ్లాడో లేదో వొచ్చి నా యెదుట తల వొంచుకొని నుంచున్నాడు.

"మీరా! యిన్నాళ్ళేమైనావు?" కళ్ళంబడి నీళ్ళు పెట్టుకున్నాడు.

"మీరా, ఎందుకోయ్. నా బాబూ!"

"దీదీ, అంతా ఆఖరా?"

"ఏమిటి?"

నా కర్థమయింది కాని అడిగాను.

"నీకు తెలీదూ".

"ఏమిటోయ్ ఆ మాట? ఏమీ ఆఖరు కాదు. నువ్వు వుత్త భ్రమ పడుతున్నావు." అంటున్నాను కానీ,ఏదో మార్పు కలిగిందని నా హృదయం అదుర్తోనే వుంది. "దీదీ! నేనీ బాధని భరించలేను. ఈ-"

"ఏమిటాబాధ! ఎందుకు?"

"నాకు తెలీటంలేదు. చాలాసార్లు ప్రశ్నించుకున్నాను, అర్థం కాదు.కాని భరించలేను. మాట్లాడలేను? ఈ మూడు రోజులూ ఆ పొద వెనక కూచుని వున్నాను-రాత్రింబవళ్ళు ..."

పాపం?

"అయ్యో, మీరా మూడురోజులు అక్కడ వున్నావా?ఎందుకు రాలేదూ? పిచ్చితండ్రీ! నిన్ను మరిచిపోయి, నేను నా ఆనందంలోనే వున్నానా? కాని నిన్ను మరిచిపోలేదు. దుర్మార్గురాల్ని, నిర్భాగ్యపుదాన్ని, ఏం చెయ్యను నీ బాధని తీర్చడానికి!"

నుంచుని అతనిని నా పక్కన కూచో పెట్టుకుని, అతని తలని గట్టిగా కావలించుకున్నాను.

"నేను నీ కక్కర్లేదు, నిజం కాదనకు....నేను చూస్తోనే వున్నాను.... నీ జీవితంలో నాకు స్థలం లేదు."

"మీరా, నువ్విట్లా అంటావని నేనెన్నడూ అనుకోలేదు. చూడు. అమీర్ నేను పూర్వంమల్లే ప్రేమగా వున్నందుకేనా నీకీబాధ? ఎందుకు వుండననుకున్నావు? వుండనని ఎన్నడన్నా అన్నానా?"

"ఛా! నేననుకోలేదు. దానికికాదు. కానీ ఈ యింట్లో గానీ, హృదయంలో గాని నాకు చోటు లేదు."

"వుంది ఎన్నటికీ పోవడానికి వీల్లేకుండా వుంది. నీకేమీ సందేహం అక్కరలేదు."

"నిజమా, నిజమా?"

"నిజం. ఇంక పిచ్చి పిచ్చి సందేహాలతో బాధపడక రా. రా. ఆడుకుందాం, పువ్వు లేరుకుందాం రా." అతన్ని లేవదీసి నవ్వించి పరుగెత్తి ఇద్దరమూ తంగేడు పువ్వులు కోసుకొంటున్నాము. కాని నా హృదయం భారంతో మూలుగుతోనే వుంది.

"నా తలలో పెట్టు."

"అమీర్‌కి బాగుండేందుకా?"

ఏం చెయ్యను?

"ఆ మాటలే అనకు. ఇద్దరికీ బావుండేందుకే."

తల్లో పెట్టాడు పూలని. మీరా తరహా మారింది. అతని వేళ్ళు నా మెడమీద జుట్టుకింద చురుకు చురుకు మంటున్నాయి. పాము పిల్లకి ఎంత పాలుపోస్తేనేం యెప్పుడో వొకప్పుడు పడగ విప్పక మానుతుందా? ఇలా గంటసేపు కాలం గడిపామో లేదో అమీర్ వొచ్చాడు.

"ఏం మీరా? వొచ్చావా?" అని లోపలికెళ్ళి పొయ్యి రాజేస్తున్నాడు. మళ్ళీ మా వేపు రాక, నవ్వుతో ఆ వూరు వచ్చిన మందుల వర్తకుడి కబుర్లు చెపుతున్న మీరా చప్పున ఆగాడు. అంతే, కొంచెం సేపట్లో అమీరు వొచ్చి కూర్చున్న తరువాత అసలే మాటలులేవు. ఆ నిశ్శబ్దం దుర్భర మయింది. దూరంగా కూచుని అమీర్ అప్పుడప్పుడు రెప్పలకింద నుంచి దగ్గిరిగా కూచున్న మా యిద్దరి వంకా చూస్తున్నాడు. రాళ్ళతో ఆడుకుంటూ తలెత్తలేదు. మీరా చివరికి ఒక్కమాట మాట్లాడకుండా చప్పున లేచి వెళ్ళాడు. తరువాత రెండు గంటలసేపు అమీరూ మాట్లాడలేదు. యేమిటా యీ వుపద్రవం పెద్ద తుఫాను ముందట. విపరీతమైన శాంతం కాదుగదా అని భయపడుతో నేను కూచున్నాను, యెండ వంక చూస్తో.

అమీర్ చప్పున 'ఆ' దీదీ యేమిటి? అన్నాడు.

"ఏమో నాకు తెలీదు."

"పిలిపించుకుంటో తెలీదేమిటి?"

"అది తెలుగూ కాదు. తురకం కాదు నాకు మాత్రం ఎట్లా తెలుస్తుంది? ఏమో ముద్దుకి అట్లా పిలుస్తాడు."

"దీదీ దాదా" అని వెక్కిరింపుగా అని యింకా యేదో అనబోయి వూరుకున్నాడు అమీర్.

'దీదీ' అన్నమాట మీరా నోట్లోంచి వొచ్చినప్పటి మాధుర్యమంతా చితికిపోయింది.

మళ్ళీ రెండురోజులు మీరా కనపళ్లేదు. అమీరుకొత్త ప్రేమతో కొత్త కాంక్షతో అన్నీ మరచిపోయినాను. కాని అమీరైనా నన్ను కావలించుకుని పడుకుని నా మొహంలోకి కళ్ళలోకి చూస్తో యేదో యేదో స్పష్టంగాని తనసందేహాన్ని నా లోపల, నా హృదయం లోపల కళ్ళలోంచి వెతుకు తున్నట్టుగా చూస్తో పరధ్యాన్నంలో పడతాడు. చప్పున మళ్ళీ నా అందంలో మైమరుస్తాడు. ఏదో తనని బాధించే అంతర శత్రువులతో పోరాడు తున్నట్టు బాధపడతాడు. నాకతనిపైని, అతని బాధపైని ఎంతో జాలి కలుగుతుంది. కాని అడగటం భయం. అడిగితే ఏం వెళ్ళబెడతాడో? మధ్య మధ్య మీరాని మరిచిపోయినానే! ఎక్కడున్నాడో! మళ్ళీ ఏ పొదల వెనక తిండిలేక మాడుతున్నాడో! రాడేం? అనుకుంటూనే మళ్ళా మరచిపోతాను. మళ్ళీ యెందుకు మరచిపోయినాను? ఎంత క్రూరురాల్ని! నాకేం అధికారముంది యింత అందంగా వుండేందుకు? అని నాలిక కొరుక్కుంటాను. కృతఘ్ను రాలినా? నా సౌఖ్యం ముందు ఏ భారాన్నీ అణగ తొక్కేస్తానా? నా గుండె విపరీతమైన రాయా? ఏమో?కాని యిప్పుడు తలుచుకుంటే ఏమనిపిస్తుం దంటే-అంతకంటే యేం చెయ్యగలుగుదును? ఎటు ఏమి చేసినా, దోవలేని మహా అగాధం ఈ జీవన నదికి ఈ మహా సముద్రమే అంతం. ఇటు ప్రవహించినా అంతేనా పుట్టక. నేను ఏ పరిస్థితులలో పడ్డానో అది నా ఖర్మ. యీ ప్రపంచాన్ని పాలించే మహాశక్తి. మన హృదయాన్ని నడిపించే రహస్య

సూత్రం. అదే నన్నూ, అతన్నీ, ప్రేమనీ, అన్నిటినీ చిరునవ్వుతో-యిట్లా మా అల్పశక్తుల్ని, దాన్నించి తప్పించుకోవాలని చూసే మా అల్ప వ్యర్థ ప్రయత్నాలని చూసి, చిరునవ్వుతో క్రూరంగా నిరాఘాటంగా, సునాయాసంగా దొర్లించు కుంటో పోయింది. దానికి కళ్ళు లేవు, చెవులు లేవు ఆత్మలేదు, ఆ శక్తే నీతిలోంచి, జడత్వంలోంచి శాంతిలోంచి, మర్యాదలోంచి మిమ్మల్ని; పాపంలోంచే, నరకంలోంచే, మహాబాధలోంచే నన్నూఅందర్నీ ఎక్కడికో ఒకచోటికే నేమో తీసుకుపోతోంది. ఊరికే మీరూ నేనూ అట్లా చేశాం. యిట్లా చెయ్యకపోయినామే అని యేడుస్తాము. అంతే నామీదాగ్రహించి, తరుముతారుగాని, మీరు చెప్పే వేదాంతమూ అదేగా! చివరికి 'దాని ఖర్మం పొమ్మం'టారు నేను 'మీ ఖర్మం' పొమ్మంటాను.

సాయంత్రం నేనూ, అమీర్ యేటికి స్నానానికి వెడుతో వుండగా దోవకడ్డంగా యెర్రని కండువా అంచు పామువలె పడివుంది. అది మీరాది, దాన్ని చూడగానే కాళ్ళు వొణికాయి. మీరా చచ్చిపోయి కండువా ముక్కని అక్కడ పారేసినట్టయింది. కాని వెంటనే అది నా కోసమే వుందని గ్రహించి, ఆగాను. ఆ చుట్టుపక్కల పొదల్లోంచి 'నువ్వు వొక్కతెవూ వచ్చిందాకా యిక్కడే వుంటా'ననీ మీరా గొంతు వినపడ్డది? ఎంతకాలం నుంచి కాచుకొని వున్నాడో! ఎంత దొంగతనము వొచ్చింది. నా మీరాకి! అని ఏడుపొచ్చింది. తలవూయించి; అమీర్ వెంట నడిచాను.

చీకటిపడే సమయాన, పొయ్యిమంట దగ్గర అమీర్నీ వొదిలి వొక్కెతను యేటి వొడ్డు వేపు నడిచాను మీరా వచ్చి చీకట్లో పక్కన నుంచున్నాడు.

"ఏమిటి మీరా?"

"రా! దూరంగామాట్లాడదాం"

"వెంటనే వెళ్ళాలి, అమీర్ వెతుకుతాడు."

"వెతకనీ, అందుకనే దూరంగా వెడదాం."

"నన్నడుగుతాడు."

"భయపడుతున్నావుకదూ?"

"ఏమిటి?"

నేను ముందే చెప్పలా. యిట్లా జరుగుతుందని? అతనడగడం, దానికి నువ్వు భయపడడం, నాతో మాట్లాడానికి వీలులేకపోవడం."

"అతని దగ్గిర రహస్యం యెందుకు? వృధాగా అనుమానం కలిగించి ఏం లాభం?"

"అనుమాన మేమిటి? మీరాతో వెళ్ళానను. ఏం?"

"కాని రహస్యంగా అతను వినకుండా, అతను చూడకుండా మనకేముంది? చెప్పు."

"ఏం లేకపోతే మాత్రం? ఏం లేదు కనకనే మనం వొంటరిగా వుంటేనేం?"

"ఎందుకు వుండడం?"

"మరి నాతో మాట్లాడవా?"

"మాట్లాడనన్నానా? అక్కడికే రా."

"పోనీ. యిట్లా నాతో మాత్రం తిరగకూడదా?"

"అతను కూడా వుంటేనేం?"

"వుండక పోతే నేం?"

నేను మాట్లాడలేదు. ఆ సమస్య నా కర్థం కావటం లేదు. అమీర్ని చూస్తే భయం వేస్తోందనే సంగతి వొప్పుకోడం యిష్టంలేదు.

"నీ కిష్టం లేదనరాదూ."

"మీరా?"

"పోనీ అతని కిష్టంలేదు. నీకు భయమను."

ఆలోచించాను.

"మీరా! నీతో యెట్లా మాట్లాడాలో నాకు తెలీటంలేదు. ఏదో తప్పు పని చేసిన వాడిమల్లే దొంగతనంగా దాక్కున్నావెందుకు?- ఎందుకు ఇంటికి రావు! రా. మాట్లాడు. ఆడుకో స్వేచ్ఛగా వుండు. మా యిద్దరితో సఖ్యంగా వర్తించు. అందులో అమీర్ నీకు కొత్తవాడా? నాకన్న ముందు అతనే కదా నీకు స్నేహం, కొత్తవాడా?"

"అప్పుడు నీతోనూ షికార్లు వొస్తా, అతనితోవస్తా....కాని మధ్య దోవలో పిలుస్తావేం, అక్కడికి వచ్చి పిలవరాదూ? ఇప్పుడతను లేనిపోని అనుమానాలు పడతాడంటే అన్యాయమా?"

"అతనెవరు అనుమానాలు పడడానికి?"

"నువ్వు సహిస్తావు."

నేను మాట్లాడలేదు. "నువ్వక్కడికి ఎందుకు రావు చెప్పు" అన్నాను.

"నాకు బావుండదు. అతనికి బావుండదు. మనిద్దరమే వున్నట్టుండదు."

"అది కొత్త. అంతే. నువ్వు నాలుగుసార్లు వొస్తే అదే అలవాటవుతుంది." అతను మాట్లాడలేదు. నా మాటలు అబద్ధాలని నా అంతరాత్మ అంటూనే వుంది. ఇద్దరిలో యెవరిని వొదలడానికి చేతగాక ఎవర్నీ వొదలకూడదనే పేరాసతో, ఆ యిద్దర్నీ ప్రయత్నించి ఒకచోటచేర్చటం అనర్థక మంటోనే వుంది అంతరాత్మ. కాని నా శక్తిలో వుండే నా అహంభావం నన్ను ప్రోత్సాహపరిచింది.

కాని అహంభావమేనా? స్వార్థమేనా? కాదేమో! అమీర్ మీద ప్రేమ. నేను లేకపోతే అమీర్ యామౌతాడో అని అతనిమీద జాలి. నేను లేకపోతే మీరా బతకలేడే అని అతనిమీద జాలి. నా హృదయంలో వుండే మార్దవం. కాదా నన్నీ గతికి తీసుకొచ్చింది. నాకన్న కఠినాత్మురాలు. తన సౌఖ్యమే చూసుకునే దుర్మార్గురాలు తనకు నచ్చినవాణ్ణి దరిచేర్చి రెండోవాణ్ణి కఠినంగా వొదిలేసేది, సౌఖ్యంగానే. బతుకునుగద! వాళ్ళిద్దరిలో కూడా ఒకరన్నా సౌఖ్యపడేవారు, రెండోవారు మరచిపోయి బతికేవారు. ఈ గతి రాదుకద?

"తప్పదు. నువ్వు కావాలి. అమీర్ని నీతో స్నేహంగా ఉంచడం నా భారం. ముగ్గురుమూ యెంతో ఆనందంగా వుందామని ఎంతో అనుకుంటే, చివరికి యిట్లా అయిపోయింది. అమీర్ తగాదా పెడతాడేమోనని భయపడ్డానుగాని నువ్విట్లా అవుతా వనుకోలేదు" అని కోపంగా అన్నాను.

నా పెదిమలు వొణకడం అతన్ని లొంగదీసింది. అతని భయాన్ని అణగదొక్కి సహజ వివేకాన్ని, అతన్ని కాపాడే 'ఇన్‌స్టింక్టుని' నాశనం చేసింది. పాపం ఏమీ తోచక కళ్ళంబడి నీళ్ళు పెట్టుకుంటో నుంచున్నాడు. అమీర్ని నమ్మవద్దనీ, నా మాటలు అబద్ధమనీ అతని అంతరాత్మ అంటోనే వుంది. కాబోలు, దుష్టురాల్ని నేను, నా సౌఖ్యంకోసం అతన్ని బలవంతంగా లోబరుచుకున్నాను- నా మీరా?

పదమటి మెరుపు అతని మొహాన్ని వెలిగించింది. అప్పుడే ప్రారంభించిన గాలి అతని ముంగురుల్ని చీకట్లో వూయించింది.

"వెడతావా?" అన్నాడు.

"నువ్వో?"

"నేనింతే?"

ఆ యెడారిలో, చీకట్లో కీచుమనే శబ్దాలలో ఈ వొంటరిగా, నిస్సహాయంగా, బంధువులందర్నీ విడిచి, నాకై పడివున్న చిన్న నా బాబును చూసి, నా మనసు కరిగిపోయింది! దగ్గిరిగా కావలించుకున్నాను.

"మీరా! మీరా! ఏదో విపరీతమైన బాధతో నువ్వు మాడిపోతున్నావు. నా దగ్గిరికి రావు. నన్ను వోదార్చనియ్యావు. ఏం చెయ్యనోయి నీ కోసం."

వెక్కి వెక్కి యేడ్చాడు నా మీరా! అమీర్ని వొదిలేసి యితనితో వెళ్ళిపోనా అనిపించింది పాపం! ఈ లేత హృదయం, ఈ అమాయకత్వం, నామీది విశ్వాసం, నా మీద ఆధారపడడం. ప్రాణమన్నా నా కోసం యివ్వడానికి సిద్ధం. ఎట్లా వోదార్చను అతన్ని?

"నీ కోసం ఏం చెయ్యను? మీరా! నువ్వు లేక నేనెట్లా బ్రతకను? ఎట్లా, నేనేం చెయ్యను?" అని యేడ్చాను. నా కన్నీళ్ళు అతని నిశ్చయాన్ని కరిగిస్తున్నాయి. నే నబద్ధం అడ్డంలేదు. మీరాని చూస్తే అట్లానే వుంది. నాకు. "నాకు తెలుసునా ఏం చెయ్యాలో? అంధకారంలో సముద్రం మధ్యలో వున్న వాడికి తీరమెటు వుంటుందో యెం తెలుసో, నా కంత తెలుసు కర్తవ్యం. మనమేం చెయ్యాలో తెలిసి, చెయ్యకపోతే శిక్షించ వచ్చు దేవుడు. కాని యింత

అజ్ఞానం, అంధకారంలో వుంటాము కద! ఎంత యోచించినా తెలీదు కద! అంతా ఐ, నాశనం చుట్టూ అల్లుకున్న తర్వాత, ఇల్లుకూలి నెత్తిమీద పడ్డతరవాత కాంతి వొస్తుంది. దోవ కనపడుతుంది. ఏం లాభం? కాని నావంటిదానికి అప్పటికీ, యెప్పటికీ తెలీదు దోవ. అసలు నువ్వెందుకా సమస్యలో ప్రవేశించావు? అంటారు పతివ్రతలు.

"అమీర్ని వొదిలెయ్యనా, వెళ్ళిపోదామా యిద్దరమూ!" అన్నాను. నిజంగానే అన్నాను. ఆ మాటలు ఇప్పుడు తలుచుకుంటే, నా మాటలు అబద్ధం అని ఏడుస్తాను.

దాంతో నా బాబు మనసు కరిగిపోయింది.

స్త్రీ త్యాగానికి ఆయత్తపడితే ధీరుడైన పురుషుడు ఆ త్యాగ లాభాన్ని స్వీకరించగలడా? ఆ మాట చాలు. తనకోసం త్యాగంచేసే స్త్రీ వుండఢం పురుషుడికి అమితమైన ఆత్మవిశ్వాసాన్నియ్యాలి. కాని త్యాగాలు గ్రహించ డానికి అలవాటు పడ్డ పురుషుడు అతినీచుడు. పతివ్రతల త్యాగాల వల్ల నియమాలు నిలబెట్టుకునే గతి మీ పురాణ ధీరులకే గానీ అమీర్‌కీ, మీరాకీ కాదు.

"నేనే వస్తాను దీదీ. రేపణ్ణించి."

"నిజంగా వస్తావా? నా పిచ్చి బాబూ. వూరికే భయపడ్డావు అవునా?"

ఇద్దరమూ యింటివైపు చూశాము.

"కాని దీదీ, ఇదివరుకు మల్లేనే నీ పక్కన కూచుంటా. నీ బుజం మీద చెయ్యి వేస్తా" అన్నాడు మీరా.

"ఆ, తప్పకుండా. ఎందుకు అడుగుతావు?"

"మరి....అమీర్ని....చూస్తున్నా...."

"ఆ, దానికేం?" అంటున్నాను గాని నా గొంతులో అబద్ధం వినిపించ లేదా నీకు. మీరా? నా బింకం కొద్దీ అనుకున్నాను. కాని నా గుండెనీరై పోతుంది. ఏం జరుగుతుందో? కాని ఫరవాలేదు. అనుకుంటో పక్కకి చూశాను మీరా లేడు. ఇంటికి వెళ్ళాను.

మర్నాడు మీరా వొచ్చేటప్పటికి అమీర్ నా తల చిక్కు తీస్తున్నాడు. మీరా తరహా మార్చాడు. రావడమే అదేదో అసహజమైన సాహసంతో, వుత్సాహంతో

వచ్చి నా కెదురుగా కూచుని నిర్లక్ష్యమైన కంఠంతో-"నేనిచ్చిన దువ్వెన యేది, దీదీ!" అన్నాడు. పాపం పూర్వం వలె మాట్లాడటానికి ప్రయత్న మది.

"ఇంకెందుకు? అమీర్ వొచ్చాడుగా చిక్కు తియ్యడానికి. చిక్కు తీసుకుని మాత్రం ఏం ప్రయోజనం?" అన్నాను. అమీర్ వంక చిరునవ్వుతో చూసి మళ్ళీ మీరావంక చూసి నవ్వాను. ఆ పని యెట్లా వుందనుకున్నావు? రెండు మహాసముద్రాల మధ్య సన్నని తాడుమీద నడుస్తున్నట్టుంది. ఏ మాట మాట్లాడితే, ఏం మాట్లాడకుండా వూరుకుంటే, ఏ చూపు చూస్తే ఎవరికి కోపం తెప్పిస్తానో! ఏమర్థంచేసుకుంటారో? అబ్బా ఆ రోజుల యమబాధ! ప్రేమ యింత ప్రాణం తీస్తుందని అనుకోలేదు. కత్తిమీద సాములే కద!

అమీర్ గంభీరంగా నా జుట్టువంక చూస్తో వూరుకున్నాడు. మీరా ఇవీ అవీ గబగబా మాట్లాడుతున్నాడు. వూళ్ళో అమీర్ రావడాన్ని గురించి అనుకుంటున్నవీ, ఆ స్టేషనులో మెయిలురైలు అపాలని అర్జీ పెట్టడం అన్నీ చెప్పాడు.

అమీర్ వొదలగానే వెళ్ళి మీరా పక్కన కూచున్నాను. అమీర్ కత్తిని పదును పెడుతో, ఆ పనిలో నిమగ్నుడై వున్నాడు. మీరా యింక దగ్గిరికి జరుగుతాడేమోనని నాకు భయంగానే వుంది ప్రతి నిమిషం. కాని అమీర్ భయంకరమైన కళ్ళు ముందు పెట్టుకుని మీరా సాహసించలేదు- నేనింక ఆ నిశ్శబ్దం భరించలేక లేచి "స్నానానికి వెడదాం" అన్నాను. ఎవరూ లేవలేదు. "మీరా, నువ్వు రా."

మీరా చప్పున నుంచుని అమీర్ మొహంవంక చూస్తున్నాడు.

"అమీర్ నువ్వు కదలవేం?"

కొంచెం మాట్లాడకుండా వూరుకొని,

"వొస్తా పదండి" అన్నాడు కత్తిమీద ధ్యాస వుంచుకుని.

ఇంకేం మాట్లాడ్డానికీ తోచక, మేమిద్దరం బైటికి నడిచాము. ఎంత దూరం పోయినా అమీర్ జాడలేదు. ఎత్తుగా పెరిగిన తంగేడుచెట్టు కింద ఆగి యెండలో మాడుతున్న గుడిశవంక చూస్తో మాట్లాడకుండా

నుంచున్నాము. చప్పున మీరా "లాభంలేదు దీదీ" అని వూరుకున్నాడు. నేనూ మాట్లాడలేదు. "అమీరక్కడ వుండగా నీతో చనువుగా వుండలేను. నా చేతకాదు" అన్నాడు, నే నేమనను?

"పోనీ తాక్కపోతేనేం మీరా. చనువుగా వుండకపోతేనేం?"

మీరా కొంచెంసేపు ఆలోచించాడు.

"అవును. తాక్కపోతేనేం? నీకేం?" అని నెమ్మదిగా అన్నాడు.

ఆ "నీకేం!" అన్న మాటలు అతని కంఠంలో నిరాశ శూలాల వలె నాటుకున్నాయి.

"అన్యాయం మీరా. నువ్వు నన్నల్లా అనడం ఇంకా తెలుసుకోలేక పోయినావు కద. నా మనసెటువంటిదో! మనకున్నటువంటి ప్రేమకి తాకడం అవసరమా?"

మళ్ళీ ఆలోచించాడు. పాపం, ఆ చిన్నవయసులో యీ సమస్యలు అర్థంగాని యీ బాధలు యివన్నీ ఆలోచించి, చెప్పుకోవలసిన గతి పట్టింది మీరాకి. చక్కని కనుబొమ్మల్ని ముడిచి కళ్ళు మూసి, ఆలోచిస్తూ నుంచున్న నా మీరాని చూస్తే నా గుండె నీరైపోతుంది.

"అవసరమని కాదు. అది అభ్యంతరం కావడమే మనకున్న ప్రేమ బంధాన్ని కాలుస్తోంది"

"అమ్మా! మీరా! ఎంత ఆలోచన వుందోయ్! అతని మాటల్లోని సత్యం నన్ను గాయపరిచి సిగ్గులో ముంచింది. ఇంక జవాబు చెప్పలేక యింటివేపు మళ్ళాను. మీరా వెనకనే వొచ్చాడు. అమీర్ కత్తి నూరుతోనే వున్నాడు. కూచున్నాను. మళ్ళీ నిశ్శబ్దం. మొదట భరించలేక అన్నం తిందాం అన్నాను. తనని పొమ్మన్నా నన్నట్టు మీరా లేచాడు.

నా తప్పు సవరించుకోవడానికి "మీరా, నువ్వు రా అన్నానికి" అన్నా.

అన్నానో లేదో, నా అవివేకం మనసుకి తట్టింది. ఒకటే మూకుడు, దాంట్లో నేనూ, అమీర్ తిన్నాము. తరువాత రోజుల్లో దాంట్లోనే నేనూ, మీరా తిన్నాము. ఇప్పుడు మళ్ళీ నేనూ అమీర్ తింటున్నాము. ఆ మూకుడు కన్న

ఇంకేమిలేదు యింట్లో. ఇవ్వాళేం చెయ్యను? వెర్రిగా నుంచున్నాను. ఇద్దరూ నాకేసి చూస్తున్నారు.

"రండి ముగ్గురమూ తిందాం" అన్నాను. అమీర్ కదలడు. మీరా కదలడు. ఎంతసేపు నుంచున్నామో? నా కళ్ళు తిరుగుతున్నాయి. నా తల్లో ఒక్క ఆలోచనాలేదు. చప్పున నా స్త్రీత్వాన్ని వుపయోగించి నవ్వు చిమ్ముతో- "మీరు యిద్దరూ పిల్లలంటో నేను కలిపి పెడతాను, ఏం?" అని వాళ్ళ వంకన్నా చూడక వెళ్ళి అన్నమూ దోసకాయ పచ్చడీ కలిపి తీసుకొచ్చాను.

"ముందు ముద్దనాది. తరువాత అమీర్."

"నేను తర్వాత తింటానులే" అని, కళ్ళన్నా ఎత్తక, విసిరాడు మాటల్ని అమీర్. అపజయంతో గుటకలు మింగాను.

"నువ్వన్నా నా మాట వినవా?" అన్నట్టు కళ్ళు మీరా మొహంకేసి ఎత్తి ముద్ద నోటిలో పెట్టాను. అతనితో మధ్య మధ్య నాలుగు ముద్దలు నేనూ తిన్నాను. తరువాత అమీర్ దగ్గిరికి వొచ్చాను.

"అక్కడ పెట్టు" అన్నాడు కఠినంగా.

'తింటున్నాను. చూశావా? ఎట్లాను నేను వేరే!' అన్నట్లు చూస్తున్నాయి మీరా కళ్ళు.

మూకుడింటో పారేసివొచ్చి బైట కూచున్నాను. ఇంకా మీరా వెళ్ళడేమో, వాడికక్కడేమిపని. అన్నట్లు తలెత్తిచూస్తాడు అమీ రప్పుడప్పుడు. మీరా కూనిరాగం తీస్తో కూర్చున్నాడు. కూని రాగం రావడానికి ఎంత ప్రయత్నం లోపల జరుగుతుందో నాకర్థమవుతూనే వుంది. నీడలతోపాటు అమీర్ ముఖంమీద క్రోధపు నీడలు కూడా దట్టమవుతున్నాయి. "చెట్టుకింద కూచుందాం" అన్నానోలేదో మీరా తను వెడతానని లేవబోయినాడు. ఏమనుకుంటున్నాడో అనుకుని -

"అప్పుడేనా? కూచో" అని కూచోపెట్టాను. అమీర్ తలెత్తినావంక చూశాడు. ఏదో కనిపెట్టేవాడివలె. కాని మీరాని యింకా పిలిచి, రమ్మని

ఆశపెట్టి, ఏడిపించి పంపుతున్నానని నాకు దిగులేసింది. కావలసి మీరా భుజం మీద చేయి వేశాను. పది నిమిషాలలో అమీర్ లేచి వెళ్ళాడు. మీరా నిద్రపోయినాడు. నేను అట్లానే యోచిస్తో దిగులుగా కూచున్నాను. అట్లానే నా కళ్ళముందు రాత్రయింది. నేలమీద నాముందుపడి నిద్రపోతున్న నా బాబు, నా నవాబుని చూసి నాకు వూరికే దిగులేస్తోంది. అమీరెక్కడ వున్నాడో, ఏయే కోపాలతో మండిపోతున్నాడో, ఏయే నిశ్చయాలతో పోట్లాడుకుంటు న్నాడో ! పాపం, అతని మీద నాకు ప్రేమపోయిందని యెంత బాధపడు తున్నాడో? యెట్లా అతనికి నా హృదయం అంతా అతని దేనని తెలియ చెయ్యడం? అతనిదేనా?

చెట్ల అకులు మెల్లిగా వూగుతున్నాయి, పటమట చంద్రుడుదయించి అపప్పుడే అస్తమిస్తున్నాడు. రెక్కలు కొట్టుకొంటో చిన్నపిట్టలు యెగిరి మాయమవుతున్నాయి. వాటి కర్థమవుతుందా నా బాధ, నా నిరాశ ఆ రాత్రి అనిపించింది. యీ మీరానించీ, అమీర్నించీ, యీమైదానంనించీ తప్పించుకొని, బైటపడగలిగితే? ఎక్కడ? దిక్కేది? ఒకటే శరణ్యం. ఆ నల్లని రాత్రి నా ప్రాణాలని, తల్లి నా యేరు కడుపులో దాచుకోనా?

"దీదీ దీదీ?" కలవరిస్తున్నాడు. నా చిన్నిబాబు!

"నా బాబూ, మీరా" నిన్నేం చేస్తానో కద! నీకేగతి రాసి వుందో నేను బతికివుంటే నీకే ఆపదో రాకమానదు, నేను కాళిని నీప్రాణం తీసుకుంటా? నన్ను వొదిలి పోరాదూ! కృతఘ్నురాలినిగా కనపడే ధైర్యం లేక నిన్ను నా వెంట యీడ్చుకొంటున్నా. నిన్ను తోసెయ్యలేక నాతో అగాధానికి నిన్నూ లాక్కుపోతున్నాను.

"మీరా! నేను అమీరు దాన్ని, నువ్వు నా కక్కర్లేదని పంపితే! అప్పుడే నిజంగా నీ ప్రాణాలు రక్షించుకుంటా, నిజంగా నీ దీదీ నౌతాను! ఆ మాట అనగలనా? నా గుండె రక్తంకారి, నిన్ను పిలిచి, నామాట అబద్ధమని చెప్పదా?"

"దీదీ" మీరా లేచాడు.

"దీదీ, దీదీ, వున్నావా? నువ్వు చచ్చిపోయినట్లు కలవొచ్చింది."

నా మోకాళ్ళు కావలించుకున్నాడు. "దీదీ? నిజంగా మా యిద్దరి మధ్యా యీ బాధ పడలేక నువ్వు చచ్చిపోవు కద?"

నా బాధ అంతా, యిద్దరినీ సంతోషపెట్టడానికి. నేను చేస్తున్న బ్రహ్మ ప్రయత్నమంతా జ్ఞాపకం వొచ్చి యేడ్చాను. గబగబ యేడ్చేశాను. నా బాబు. నా మీరా ఎన్నోవిధాల నన్నోదార్చాడు.

"నేనింక ఎన్నడూకనబడను. వెళ్ళిపోతా. నువ్వు సుఖంగావుండు"

"అయ్యో! నిన్ను వొదల గలిగితే యింత క్షోభ ఎందుకు?"

నిజంగానేనా? నిజంగానేనా? నా కోసం. నా మీద జాలిపడి కాదు. పొమ్మనక పోవడం? నీ కోసమేనా?

"ఇంక ఏం కానీ, నా గొంతులో వూపిరి వున్నంతవరకు నిన్ను, నిన్ను వొదలను" నా మెడ కావలించుకున్నాడు.

నక్షత్ర మొకటి కిందికి జారింది.

వెంటనే వొస్తానని మీరా వూళ్ళోకి వెళ్ళాడు. అమీర్ వొచ్చి మాట్లాడకుండా కూచున్నాడు. పొద్దుటి అన్నమే తిన్నాం. నేను అమీర్ దగ్గిర కూచుని కబుర్లు చెబుతున్నాను. నా హృదయానికి కొంచెం విశ్రాంతి కలిగింది. మీరా రాలేదు. వొస్తాడేమోనని భయంగావుంది. నక్క గాని, కుందేలు గాని చీకట్లో చప్పుడు చేసినపుడల్లా వులికిపడి చూస్తున్నాను. అమీర్ కనిపెట్టాడు గావుననుకుంటా. "రా తిరుగుదాం."

మీరా వొచ్చి వెతుక్కుంటాడేమోనని దిగులుగానే వుందిగాని- హృదయం మాత్రం యింకా విశ్రాంతి కావాలని కోరుతోంది, బైలుదేరాము.

చీకటి. కటిక చీకటి. అమీర్ భుజం మీద నించి, మెడమీద నించి చెయ్యివేసి, నా శరీరమంతా అతనిమీద ఆనించి, మోకాళ్ళ వరుకు రాసుకునే చెట్లలో, గడ్డిలో, రాళ్ళలో ఇసికలో నడుస్తున్నాము. అంతులేని ఆకాశంలో, గుర్తులేని లోకంలో, ఏమీ కనపడని అంధకార గర్భంలో యిద్దరమూ, దగ్గిరిగా మృదయాలు కొట్టుకుంటో తిరుగుతున్నాము! ఎంతసేపో! అమీర్నానుకొని. అతని చేతికింద సమస్తమూ-నా బాధలు, నా సందేహాలు, భయాలూ అన్నీ మరిచి ఆ రాత్రిలో కలిసిపోయినాను.

ఎల్లాగో అతని ముందు నా హృదయాన్ని విప్పి అర్థం చేయించి నాతో సానుభూతిని చూపేట్టు చేస్తే! వెర్రి కలలు. అంత దగ్గిరిగా నడుస్తున్నాము. ఒకరికింకోరు ప్రాణతుల్యం. కాని ఒకరి సంగతి ఇంకోరం అర్థం చేసుకోము. అతని సంగతి తెలిసికూడా నేను అశక్తురాల్ని నా సంగతి తెలుసుకోలేక అతను అశక్తుడు. ఎందుకిట్లా పుట్టామో!

అప్రయత్నంగా, మామూలు తోవనే మాకు తెలీకుండానే మాకాళ్లు మమ్మల్ని కొండమీదికి తీసుకువెళ్ళాయి అటు వెళ్ళి మా పాత బురుజు చివర కూచుని కాని రాము.ఎంత చీకట్లోనైనా అమీర్‌కి తోవతెలుసు. కళ్లు కట్టుకుని ఆ పిట్టగోడమీద నడిచి వెనక్కి రాగలడు. గోడదగ్గరగా వొచ్చామో లేదో ఏదో గోడమీదనించే కిందికి జరజర చప్పుడయింది.

"ఏదో పశువో, లేక తోడేలో?"

"పాపం చస్తుంది కాదూ?" అంటో వుండగానే, నా కంఠస్వరంతో కలిసే, కెవ్వున కేక వినపడ్డది- "దీదీ!" అని,

"మీరా! మీరా! పడ్డావా ఆ అగాధంలో"

వొళ్ళు తెలీక పరుగెత్తాను నేను.

"మీరా మీరా! మీరా!"

ఇంకేం మీరా! ఎక్కడ వున్నాడు? ఎందుకు అరిచాను? లాభమేమిటి? కొండలన్నీ మీరా నా మీరా" అని వెక్కిరిస్తున్నాయి.

కాని అద్భుతంగా ఆ అగాధంలోంచి హీనస్వరం-"దీదీ" అంది.

నా చెవులు నన్ను మోసగించాయా, లేక ఏదన్నా భూతం నన్ను వెక్కిరిస్తోందా? లేక అతని ఆత్మ అరిచిందా? ఆ అగాధంలోకి తొంగి చూస్తున్నాను గావును. అమీర్ చెయ్యి నా కంఠాన్ని వెనక్కి లాగింది, పడతావు వొంగకు."

అమీర్, పాపం వెనకనే వున్నాడు.

"అమీర్! అమీర్! నా మీరా, నా మీరా, నా మీరా"

"మళ్ళీ పిలు!"

అది కోపమేనా! దడిపిస్తున్నాడా! పిలు. ఏం చేస్తానో అన్నాడా? నాకు ఒళ్ళు తెలీదు.

"అమీర్ బతికే వున్నాడు. ఎట్లా! అయ్యో మీరా! నేనింక బతకను. ఎట్లా బతకను, మీరా లేంది!" నాలిక కొరుక్కున్నాను. ఆమాటన్నందుకు. అమీరేం చేస్తాడు? సరే. నీ మీరా దగ్గిరికే పామ్మని మెడపట్టుకు తోస్తాడా?

'మళ్ళీ పిలు' 'మీరా'

"దీదీ?"

"వున్నాడు. బతికే వున్నాడు....అమీర్ ఏం చేస్తున్నావు!"

"వుండు....ఎక్కడ వున్నాడో అడుగు."

"మీరా, ఎక్కడ వున్నావు?"

"దీదీ, శలవు. మధ్యలో చెట్టుని పట్టుకుని వేళ్ళాడుతున్నాను. నా చేతులు యింక ఆగవు. పడిపోతున్నాను, దీదీ, నువ్వు గొప్పదానివి. నిన్ను చూస్తే....నీ కోసం నాప్రాణమన్నా యిచ్చేసేవాణ్ని. నువ్వు యింటిదగ్గిర లేవు అందుకని వెతుక్కుంటో-"

వినలేకపోయినాను. మీరాని మరచి అమీరుతో వొచ్చినందుకే? నాకోసమే! మీరా యిట్లా అయిపోయాడు. నాకోసమే! నా మీరాని చంపుకున్నాను. అయ్యో! నేను దూకి ఛస్తే మీరా! నా మీరా! నేను వొస్తాను మీరా! నేను ఛస్తా!

ఆ అగాధాల్లోంచి ఆ చీకటిలోనించి, చెట్ల గుబుర్లోంచి ముళ్ళల్లోంచి వొచ్చింది. వస్తూంది. వుదారుడయిన నా మీరా వాణి.

"దీదీ! అమీర్ మీదనే నీ ప్రేమ. అమీరే నీకు కావాలి. నే నక్కరలేదు. నాకు తెలుసు నేను చావడమే మంచిది."

"ఆగు రెండు నిమిషాలట్లాగే ఆగు."

"ఎవరదీ?" అమీరు కంఠం.

"నా చేతులు పీక్కు పోతున్నాయి. దీదీ శలవు."

"వోదలకు, వొస్తున్నాను."

చీకటిలో నా కళ్ళ కిందనించి (అమీరు మాట్లాడుతున్నాడు. కిందికి దిగుతో అగాథంలోకి దూకాడు.) అమీరు, నా ధీరుడు నా మీరా కోసం.

ఎట్లా గడిపానో ఆ నిముషాలు. అమీరు కోసం భయం. నా మీరా కోసం ఆదుర్దా. ఆ అగాథం క్రింద యేం జరుగుతుందో తెలీదు. పిలిస్తే, మాట్లాడితే వాళ్ళకేం అపాయం కలుగుతుందో?

అమీరు మీద నాకు నమ్మకంలేదు. ఎట్లా లేకపోయిందో అనుకుంటాను. నా అమీరు నీచమైన పని చేస్తాడా? ఏమో? నీచురాల్ని నేను సందేహించాను. మీరాని రక్షించడానికే వెళ్ళాడా? తన చేతులతో చంపితే గాని కసి తీరకనా? ఇద్దరూ జారిపడి వొక్కరూ పైకి రాకపోతే ఆ చీకట్లోంచి!

మెల్లిగా తీసుకొచ్చాడు. ఆ అగాథంలోంచి మెద వేళ్ళాడిపోయే మీరాని!

"అమీరు!"

"ముందు వాడి సంగతి చూడు."

మీరాని కావలించుకోవాలని ముందుకి వంగాను కాని అమీరు చేసిన త్యాగంతో మూర్ఛపడివున్న నా హృదయం అమీర్ని చూసి జంకింది.

"దీదీ?"

"నా మీరా?"

# 9

"వెన్నెల యీవాళ్ళ వొంటిగంటకే పోతుంది. మనం తొందరగా వెళ్ళాలి. భోజనం చేద్దాం." అన్నాడు అమీరు.

"అయ్యో మీరు పిలిచిన పదిమంది బ్రాహ్మణులూ యింకా రాకుండానే మడికట్టుకుంటారా?" అని పూర్వపు వుల్లాసం తెచ్చుకోవటానికి ప్రయత్నించాను.

"ఆ మాసంపు కూర చల్లారిపోదూ!"

"మిగిలిందే పెట్టు వాళ్ళకి."

"పోనీలెండి! మూతపెట్టిపోదాం. వొచ్చి వడ్డించుకు తింటారు" అని నవ్వుకుని లేవబోతున్నాను. మీరా వొచ్చాడు.

ఆ ఉదయం వెళ్ళిన మీరా మళ్ళీ యిదే రావడం.

భోజనం చేశాం. కాని అమీర్ వుత్సాహం నశించింది. అంత కోపమున్నవాడు రాత్రి మీరానెందుకు రక్షించాడో నాకు తెలియలేదు, అడగడానికి అసలు మీరా సంగతెత్తడానికి భయం.

అమీర్ గుడిశకి దూరంగా పచారు చేస్తున్నాడు. నేనూ, మీరా గుడిశ ముందు కూచున్నాము. షికారుప్రస్తావనేలేదు.

"మీరా, యిన్నేళ్ళేమయినావు?"

మీరా నా దగ్గిరిగా జరిగి, గొంతు తగ్గించి "దీదీ నిన్ను వొదిలి నిన్ను చూడక నేను బతకలేను. నిశ్చయం" అన్నాడు.

ఆ గొంతులోంచి నాకు వినపడ్డది ఆ సంగతి ఇన్ని రోజులూ నా బాబు ఎంత బాధపడివుంటాడో! నా కోసం, నా క్షేమంకోసం. నా సౌఖ్యం కోసం. నా వేపు రాకుండా వుండాలనే నిశ్చయం నిలబెట్టుకోడానికై ఎంత ప్రయత్నించి వుంటాడో! దగ్గరికి జరిగి అతని తలని నా రొమ్ముకి అదుముకుని కూచున్నాను. అమీర్ చూస్తాడని భయపడే సమయం కాదు. నా పమిట మీరాకి వీవన వీస్తోంది. నా హృదయం అతనికి జోలపాట పాడుతోంది. నా పెదవులు అతని కన్నులకి శీతలాంజనం రాస్తున్నాయి. ఆనందంతో నేనూ కళ్ళుమూశాను.... "నిద్రవొస్తోంది. రా పడుకుందాం" అన్నాడు అమీర్. ఉలికిపడి కళ్ళు తెరిచాను. ఆ కంఠం వినేప్పటికి అంతసేపూ అమీర్ హృదయంలో యెంత యుద్ధం జరిగి వుండాలో గుర్తించాను. నా సాహసం, మీరాని అంత దగ్గిరగా, అతని యెదుటనే ముద్దుచెయ్యడం, దాని అర్థాన్ని

గ్రహించడానికీ, పొంగే ఈర్ష్యని అణుచుకోవడానికీ అతను చేసిన ప్రబల ధైర్యంగాని, నిబ్బరంగాని నా దగ్గిర లేవు. నెమ్మదిగా మీరా తలని నా రొమ్ముమీద నించి దించి కటిక నేలని పెట్టిన కఠినాత్మురాలిని. అమీర్ దగ్గరికి వెళ్ళాను. "రా పడుకో" అని తన పక్కన పడుకోపెట్టుకుని మీద చెయ్యేసి ఒక్కమాట మాట్లాడకుండా నిద్రపోతున్నాడు. ఏమేమో ఆలోచనలతో దూరాన కట్టేసిన తన లేగను డొక్క లెగరేసుకుంటో చూసే ఆవువలె మీరా నా పాదాల దగ్గిర కూచుని వున్నాడు. మాట్లాడబోయినాను. కాని అమీర్ లేస్తాడని భయం. కదలలేదు. నేను లేచినట్టే తెలియనీయలేదు. నా పాదాలని వొళ్ళో పెట్టుకుని తన పొడుగైన మెత్తని వేళ్ళతో తాకుతో, తన జుట్టుతో తుడుస్తో కన్నీళ్ళతో, నిట్టూర్పులతో వాటిని తడిపి ఏడుస్తో గడిపాడు. ఎట్లా ఆపను, ఎట్లా వూరుకోను? అమీరు చేతికింద కొట్టుకునే హృదయానికి మీరాని లాక్కుని అద్దుకుంటే?

తెల్లారేటప్పటికి మీరా లేడు. అమీర్ లేడు. కాని యెవరేమైనారనీ, యేం జరిగిందోనని హడలు పడడం మానేసింది హృదయం. క్షోభపడి క్షోభపడి రాయైపోయింది గావును. అట్లా కొండలకేసీ, వాటినాక్రమించుకున్న యెండకేసీ, యెండని తరిమి వాటిని కప్పుకున్న మబ్బులకేసి చూస్తో కూచున్నాను. నామీద రెండు రెవికలు పడవేసి,? "ఈవాళనించి యివి వేసుకుని వుండు" అన్నాడు.

దవడ పగిలేట్టు కొట్టినట్టయింది నా మనసు. మధ్యాన్నమైనా అమీర్ నాతో వొక్క మాట మాట్లాడలేదు. అతను నన్ను మీరా విషయమై ప్రశ్నలు వేసి పరీక్షించి నా మాటలు నమ్మక తిట్టినా కొట్టినా, కాల్చినా కొంత భయం వొదిలిపోను. కాని వొక్కమాట లేకుండా, మబ్బు లేని ఆకాశంలాగా తీక్షణంగా మౌనంపూనడం నాకమితమైన ఘోరంగా వుంది.

రాత్రి అట్లానే ఒక్కమాట లేకుండా పడుకున్నాము. ఊపిరాడకండా ఉక్కిరి బిక్కిరైనట్టయి కళ్ళు తెరిచాను. అమీర్ చేతులు నన్ను బిగించాయి. అతని కళ్ళు భీషణంగా నా కళ్ళల్లోకి మెరుస్తున్నాయి. అతని వేళ్ళు నా భుజాన్ని పిండేస్తున్నాయి. అతని వొళ్ళు బిగుసుకుని, నా వొంటిని బిగిస్తోంది. అతని

శ్వాస నన్ను కాలుస్తోంది. నా బతుకు అంతమయిందేమో? నేను చిన్నప్పుడు చదివిన కథలోని "డెసి డిమోనా" గతి నాకు పడుతుందేమోననుకొని వొణికాను.

"అమీర్, అమీర్, ఎందుకు? నే-"

అతని కఠినమైన పెదవులు నా పెదవుల్ని నలిపాయి. అతని ముందరి పన్ను నా కింది పెదవిలోకి దిగింది. ఆ రాత్రికి మాత్రమే నేను దొరికినట్టు, ఆ వూళ్ళోని బ్రాహ్మణకన్య, ఆ యెడారిలో ఆ రాత్రికి మాత్రమే, తనకి కనబడకుండా నేను మాయమౌతానేమో అన్నట్లు ఆ యెడారి మధ్య ఆ వేడిగాలిలో , ఇసికలో, ఆకాశపు నక్షత్రాల కాంతిలో, తోడేళ్ళ అరుపుల మధ్య నన్ననుభవించాడు అమీర్. అతని ప్రాణం వున్నదో లేదో తెలీక, అతని రొమ్ముమీద తల పెట్టుకుని, నా జుట్టు అతని చుట్టూ స్థలాన్ని కప్పుతో, చిరిగిన రెవిక పీలికలు నాకూ ఇతని రొమ్ముకీ అడ్డంగా, నా చేతులు అతని మెడని కావలించుకుని నిద్రపోయాను- చివరి నిద్ర అమీర్తో.

మెల్లిగా రెండు వేళ్ళు నా చెంపమీద తగిలాయి. కళ్ళు తెరిచి నక్షత్ర కాంతిలో మీరాని గుర్తుపట్టాను. నేలకి జీరాడే నా జుట్టుని పాపం మెల్లిగా పైకెత్తి, కళ్ళకద్దుకుని మృదువుగా లాగాడు- ఎట్లా లేచి వెళ్ళనూ? నా చేతులు అమీర్ మెడకింద. నా ఉట్టు అతని వీపుకింద నా తల అతని రొమ్ముమీదకి. అతని కాలు నా కాలుమీద మెలిక. కదలక పడుకున్నాను. దగ్గిరికి వొచ్చి నా గడ్డం పట్టుకుని వూయించాడు. ఏమిటా సాహసం సింహం నోట్లోంచి లేడిపిల్లని తప్పించాలని? ఆశ్చర్యపోయాను. మీరాయేనా? నాకు చాలా భయమేసింది. ఎట్లాగో తెలిసింది. అదే ఆఖరు రాత్రి యీ మైదానానికి. యీ లోకానికి-నా జీవితానికి, ఆనందానికి ఆఖరు రాత్రి. ఈ పోట్లాటలు యీ తీవ్ర సమస్యలూ- యీ హృదయ ఆరాటాలు- యీ ఘోర ఆకర్షణలు అంతమయ్యే రాత్రి వొచ్చింది. నా పిల్లిపిల్ల మీరాకి అంత సాహసమా? ఏం చెయ్యను. "రా" అంటున్నాడు. మెల్లిగా వొదిలించుకున్నాను, కడసారి-నా జుట్టుని-అమీరు చుట్టూ అల్లుకుని రానంటున్న నా జుట్టుని అమీరు రొమ్ముమీద పడుకున్న నా చంపల్ని - అతని మెడనల్లుకున్న నా చేతుల్ని. కఠినాత్ముకరాల్ని విడదీసుకున్నాను. అతను లేవలేదు. మెల్లిగా మీరా వెంట నడిచాను.

నా వంక చూస్తున్నాయి. చీకటిని చీల్చుకుని అతని చూపులు నన్ను పరీక్షిస్తున్నాయి. వెతుకుతున్నాయి. అర్థం చేసుకుంటున్నాయి. అతని విశ్వాసం, అతని నిశ్శబ్దం, అతని అడుగుల తొందర, అతని చేతుల వూపులన్నీ మాట్లాడుతున్నాయి. తల తిరుగుతోంది, అలసట వదలక నా కళ్ళు మూతలు పడుతున్నాయి. నా హృదయం యింక బాధపడలేనని మూలుగుతోంది. అడుగులు తూలుతున్నాయి. మీరా ఏమిటో మాట్లాడుతున్నాడు. కాని నేను వినలేదో వింటే మరచిపోయినానో! ఏవేవో మాటలన్నాడు దారి పొడుగూతా.

"నేనింక వూరుకోను. నిన్ను చూడకుండా వుండగలనా? నాకు కనబడకుండా తీసుకుపోతాడా నిన్ను! నాకు తెలుసు నిన్ను చంపుతాడు, నాకు కాకుండా. నువ్వు నా దానివి, నే నెవ్వరికియ్యను. చూస్తూ నేనూరుకోను. నిశ్చయం; రా! నా జీవితమంతా నీ సేవలోనే గడుపుతా."

"ఎక్కడికేమిటి? ఎక్కడ కన్నాను."

"మక్కాకీ, బనారనుకి, లాహోరు వెడదాం. ఎక్కడికైతేనేం నువ్వూ, నేనూ కలిసివుంటే చాలదా? వూరూరికి తిరుగుదాం. బిచ్చమెత్తు కొందాం. వాడి దగ్గర్నించి,ఆ రాక్షసి దగ్గర్నించి, ఆ సైతాను దగ్గర్నించి తప్పించుకుంటే చాలు. వాడు నన్నిక తాకడానికి వీల్లేకుండా పోదాం. నా దీదీని అట్లా యేడిపించి, అట్లా నలిపేసి, చీల్చేసి నేనోర్చుకోలేను, నేనూరుకోలేను. నేనూరుకోను. నాదానివి, నన్నేడిపించకు, నన్ను చంపకు, నాదానివే." అంటో తన కదుముకుంటున్నాడు.

"వుండు మీరా యెక్కడికి యింకా?"

"దీదీ, ఏదీ....నువ్వు నా దానివి, నా దానివి రా."

నన్ను కావలించుకుని ఆక్రమించుకున్నాడు. మా కాళ్ళు చీకట్లో మెలికలు పడుతున్నాయి.

"వొదులు మీరా! ఇంక రాను - వుండు నాకు నిద్ర వొస్తోంది."

ముందుకు లాగాడు. నేను తూలాను. కాళ్ళు తొక్కుకుని నేను కింద పడ్డాను; సగం యిసికలో సగం నీళ్ళలో, ఎక్కడో చీకటి, నిద్ర అలసట.

ఇంక నడవక్కర్లేదు. అంతేచాలు. నా పక్కనే, సగం, నామీద, సగం నా పక్కన మీరా పడ్డాడు. అతనిమీద ఒక చెయ్యి వేసుకుని కళ్లు మూసుకున్నాను.

"లే, వెడదాం, లే."

"ఎక్కడికి మీరా?"

"ఎక్కడికో"

"నేను రాలేను. నేను రాను. వుండు నాకు నిద్ర వొస్తుంది."

"రావూ. రావూ? ఇంకా వాడి దగ్గర వుంటావా? నేను వుండనిస్తానా? నా దానివి?"

ఇది మీరాయేనా? నాకు తెలీదు. శక్తిలేదు. మీరా మాట్లాడుతున్నాడు. మీరా నన్ను లోబరచుకుంటున్నాడు.

"వాడేనా? వాడిదానివేనా నువ్వు? సొంతం సంపాయించాడు పాపం?"

మొన్ననేగా తనని అమీర్ మృత్యువు నించి రక్షించాడు? అది కూడా మరిచాడు కదా మీరా? అప్పుడు మరిచాను కాని ఆ సంగతి యిప్పుడు యోచిస్తున్నాను. ఎంత తపనలో కుమలకపోతే, కృతజ్ఞతని కూడా మరుస్తాడు. ఉదారుడు నా మీరా! తక్కిన విషయాల్లో ప్రాణానికి ప్రాణమిస్తారు. స్త్రీ విషయంలో ప్రాణానికి ప్రాణం తీసుకుంటారు.

"దీదీ, దీదీ, నా దీదీ, రా ఇట్లారా, నీకోసం యీ పెదిమలి కోసం యీ చేతులకోసం-

ఆ రాత్రి, ఆ నీళ్ళలో, యిసికలో, చీకట్లో, మీరా నన్ను తనదాన్ని చేసుకున్నాడు. అతని మనసు నొప్పించే శక్తిగానీ, అతనిమీద అధికారం చేసే శక్తిగానీ నాకు లేదు.

ఎంత సేపయిందో తెలీదు. కారణం లేకుండానే నాకు తెలివి గలిగింది. మీరా నామీద పడుకొని వున్నాడు. అతని జుట్టు నా మొహంమీద పడ్డది. అతని చేతులు నా వీపుకిందనించి, యిసికలో పాకుతున్నాయి.

అమీరు నన్ను చేసిన గాయంమీద, మీరా మెత్తని పెదిమలు. ఏదో శక్తి నా కళ్ళని విప్పిందే - అదే చీకట్లో బాగా కళ్ళువిప్పి చూసేట్టు చేసింది.

మా పక్కనే నల్లని ఆకారం. అమీర్ కళ్ళు.

చేతులో తళతళలాడే కత్తి! మా యిద్దరిమీదా అది దిగుతుందని తెలిసి కళ్ళు మూసుకోబోతున్నాను. జుట్టుపట్టుకుని మీరాని పైకెత్తాడు. నా మీరా కోసం ప్రాణం హడలిపోయింది. పిల్లినోటిలో చిక్కిన పిచ్చికలాగు కిచుమన్నాడు మీరా. చప్పున లేచి, అట్లా మీరాని కావలించుకుని అమీర్ కత్తికి అడ్డుపడ్డాను. నా బరువుతో మీరా కిందా, నేను పైనా యిసుకలో దొల్లాము.

"వాణ్ణి వొదులు" అంది అమీర్ గొంతు బొంగురుగా!

"నన్ను చంపిం తరువాత-"

"నిజమా-"

"నిజం"

"అరే"

కదలక, మీరాని, బైటికి కనబరచక, నా రొమ్ముతో, నా జుట్టుతో, నా తొడలతో కప్పేశాను. ఎదురుచూస్తున్నా కత్తి నా మీద దిగుతుందని. చప్పున నిష్కారణంగా, నా ప్లీడరుగారూ, యిల్లూ, లా పుస్తకాలూ కళ్ళముందుకి వచ్చాయి.

నిశ్శబ్దం పదినిమిషాలన్నా జరిగివుండాలి. కళ్ళుతెరిచాను.....ఎవరూ లేరు.

లేచాను ఇసికలో జిగురుగా కాలికి తగిలింది రక్తం .... పక్కన అమీర్ పడి వున్నాడు.

"అమీర్" అన్నాడు మీరా.

"మీరా పరుగెత్తు, డాక్టర్ని తీసుకురా!" అన్నాను.

మీరా సంశయిస్తున్నాడు.

"దీదీ, నా కోసం నువ్వు...."

"మీరా, పో, తొరగా."

"దీదీ నిన్నొకత్తెనీ...."

"మీరా, నాకు కోపం తెప్పించకు."

"మీరా పొదల వెనక మాయమైనాడు. తొర తొరగా అమీర్ని వెతికాను వొళ్ళంతా ఎక్కడ తాకినా రక్తమే, నా ముద్దు ఉంగరాల జుట్టు, నన్ను కావలించుకుని వొత్తుకున్న రొమ్ము! ఆ బలమైన చేతులు వేళ్ళాడిపోతున్నాయి. "అమీర్, అమీర్?" కళ్ళు తెరిచాడు.

"ఏమిటి అమీరు, యిది! ఎందుకు అమీరు యిట్లా చేశావు? నేనేం గాను? నువ్వులేక ఎట్లా బతకను అమీర్? నన్ను చంపు" అని ఏడ్చాను.

"నిన్ను చంపదలచుకోలేదు. చంప వొద్దనుకున్నాను. నేనో మీరాయో, ఒకరమే బతకాలి, నీకు మీరా కావాలి."

"నువ్వు చావడమెందుకు అమీర్!"

"నిన్ను విడిచి బతకలేను."

"విడవడ మెందుకమ్మా!"

"ఆ మీరాతో నిన్ను పంచుకుంటాననుకున్నావా? తురక బిడ్డని."

"రా. యిట్లారా!" అని నా తలకోసం చెయ్యి యెత్తబోయి బలం లేక కింద పడేశాడు. నేను గొల్లున ఆ చీకట్లో, అరణ్యంలో బిగ్గరగాయేడుస్తూ బరువుగా వేళ్ళాడే అతని చేతిని భుజమ్మీద పెట్టుకున్నాను. నా తలనిమెల్లిగా తన రొమ్ముమీదికి లాక్కున్నాడు. ఏమేమో మాట్లాడాను.

"అమీర్, అమీర్! నమ్ము. నీమీద నాప్రేమ ఏమాత్రమూ తగ్గలేదు. మీరా విచారం చూడలేక అతన్ని నిరాకరించలేదు. కాని నువ్వేకావాలి నాకు. నేను నీ దాన్నే. ఎందుకిట్లా చేశావ్ అమీర్?...." అని ఎంతో ఏడ్చాను. అమీరు మాట్లాడలేదు. మెల్లిగా అతని ఊపిరి తగ్గిపోయింది. తలెత్తాను నాజుట్టు అమీరు పళ్ళసందున కరుచుకుపోయింది. అమీరు ఇంకా నాకు లేకుండా పోయినాడు. బతికివున్న అమీర్ని చూసేకంటే అతని శవాన్ని చూస్తే నాకు భయం వేసింది. నేను వొంటరిగా వున్నానని అప్పుడు తట్టింది. చుట్టూ చూశాను.

ఎక్కడో నే నెరగని స్థలం అది, నల్లని నీళ్ళగుంట పక్కన నా అమీరు పడి వున్నాడు. నేను కదిలినప్పుడల్లా కప్పలు నీళ్ళలోకి దూకుతున్నాయి.

తుంగలోంచి గాలి యీడ్చుకుంటూ పోతోంది. చల్లనైన అమీరు చెంపలు తాకడం భయమేసింది నాకు-నా అమీరు చంపల్ని తాకడానికి ఇప్పుడు నన్ను కావలించుకున్న అమీర్ని తాకడం అతని వంక చూడడం భయంగా వుంది. నా అమీరు కాడు.

"అమీర్! అయ్యో, అమీర్!" అని పెద్దగా యేడ్చి, నా కంఠం విని భయపడి, నేనే వూరుకున్నాను. అట్లా పిలిస్తే అమీరు లేస్తాడేమోనని వణికాను. కాని నిజంగా అమీరు పోయినాడా? బతికి లేస్తాడేమో?

చుట్టూ కటిక చీకటి, పొదలు, దోవ తెలీదు. ఆకాశంమీద మబ్బులు కప్పి, ఊపిరాడనట్టు చేశాయి. నక్కలు కూస్తున్నాయి. రావుకద, యీ శవం దగ్గిరికీ! యమదూతలు రారుకదా! వెళ్ళిపోనా? ఎట్లా వుండడం అంత భయంతో! అమీర్ని నా వంక అంత ప్రేమగా చూసే అమీర్ని నా కోసం ప్రాణమిచ్చే అమీర్ని నేను వొదిలి వెళ్ళనా? వున్నాను. వొణుకుతో కొంత సేపు యేడ్చాను. కొంతసేపు వొణికాను. కొంతసేపు అమీరు వంక చూశాను. దైవకృపవలన, ఇంక భరించలేక మోడునై పడివున్నాను. తెల్లవారదు. ఎడతెగని రాత్రి అది. ఇంక అసలు లోకానికి పునఃకాంతిలేదు. ఇంతే. ఈశ్వరుడే అస్తమించాడనిపించింది. కాని నా కోసం లోకం అగుతుందా? మెల్లిగా తూర్పు తెల్లనై నీళ్ళు మెరిశాయి. తుంగ కదిలింది. అమీర్ మొహం కనబడ్డది. ఇంకెన్నడూ కళ్ళు తెరవని నా అమీరు మొహం అతని రొమ్ముమీద లోతైన గాయం. అప్పుడేడ్చాను, నా అమీరు కోసం దిక్కులు మారుమోగేట్టు. నా గుండె పగిలేట్టు, లోకం నామీది చీకటి ముసుగు తీసి నా వొంటరితనాన్ని చూసింది.

"మీరా, డాక్టరూ, పోలీసులూ వచ్చారు. మీరా చేతికి సంకెళ్ళు.

"ఇదేమిటి మీరా?"

తొర తొరగా.

"అమీర్ని చంపింది నేనేగా" అన్నాడు.

తెల్లబోయి చూశాను.

"నువ్వా!"

"కాదు, మీరా. అతనే పొడుచుకున్నాడు."

మీరా తెల్లబోయాడు.

పోలీసులు చిత్రంగా చూశారు.

"వీళ్ళందరూ ఎందుకు వచ్చారు?"

"నేను డాక్టర్ని పిలిస్తే, అతను పోలీసుల్ని పిలిచాడు. నన్నడిగితే నేనే పొడిచానన్నాను."

"ఎందుకట్లా అన్నావు మీరా?"

"నాకు అమీర్ పొడుచుకున్నాడని తెలీదుగా?"

"తెలీకపోతే...."

"నేను అనుకున్నా."

"ఎట్లా అనుకున్నావు? అబద్ధం. నిజం చెప్పు."

పోలీసుల వంక చూసి నెమ్మదైన గొంతుకతో.

"నువ్వు పొడిచావనుకున్నా" అన్నాడు నా మీరా.

"అతనే పొడుచుకున్నాడు అన్నాడు."

నమ్మకం లేకపోవడం చూపించే చిరునవ్వు నవ్వాడు ఆ పోలీసు మనిషి.

తప్పు చేశా ననుకుని.

"కాదు, నేనే పొడిచాను" అన్నాను.



BC

KLVA1048222

# మా దగ్గర దొరికే చలం గారి పుస్తకాలు

1 శశిరేఖ
2. మైదానం
3 వివాహం
4 దైవమిచ్చిన భార్య
5. బ్రాహ్మణీకం
6 అమీనా
7 అరుణ
8. జీవితాదర్శం
9. సీతతల్లి
10. బిడ్డ
11 ఆమెపెదివులు
12. వేదాంతం
13. జానకి
14. కళ్యాణి
15. పాపం
16. కొత్తచిగుళ్ళు
17. ఆ రాత్రి
18. అనసూయ
19. ప్రేమపర్యవసానం
20 యవనవ్వనం
21. శేషమ్మ
22. జెలసి
23. స్త్రీ
24. బిడ్డల శిక్షణ
25. ఆనందం
26. విషాదం
27. చలం (ఆత్మకథ)
28. బుజ్జిగాడు
29. ఆత్మార్పణ
30. కవి హృదయం
31 టాగోర్: గీతాంజలి
32. రూబాయీలు
33 కాన్క
34. మ్యూజింగ్స్
35. ప్రేమలేఖలు
36. సత్యం-శివం-సుందరం
37. పురూరవ
38. సావిత్రి
39. చలం సాహిత్య సుమాలు
40. చలంగారి ఉత్తరాలు చింతా దీక్షితులు
41. " " మహాస్తాన్
42. " " శ్రీ రమణస్తాన్
43. " " సూర్యప్రసాద్
44. " " జలసూత్రం రుక్మిణీ నాథ శాస్త్రి
45. " " జీవన్
46. " " చలం మిత్రులు
47. " " కురేంగశ్వరరావు
48. " " బి.వి.నరసింహారావు
49. " " వీరేశలింగం
50. " " రంమజోగారావు
51. " " జవహర్



## మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104B222 |
| పుస్తకం పేరు | మైదానం |
| తారీఖు | 03 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sireesha |
| పేజీలు విడదీసినది | Sireesha |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |